# శాంత పెళ్ళి

(నవల)

"కమలాకాంత్"

పబ్లిషర్సు:
జయంతి పబ్లికేషన్సు,
గోపాలరెడ్డి రోడ్డు :: విజయవాడ-2.

పూజ్యపితామహులు :

కీ|| శే|| వరసు సుబ్బారావుగారి

దివ్యస్మృతికి :

భక్తిపూర్వకంగా సమర్పితం.

# శాంత పెళ్ళి

పెళ్ళిపందిరి నవవధువులా కళకళలాడుతోంది. కొత్త పెళ్ళికూతురి మనసులోని మధురభావాల కలవరంలా పందిట్లో వాతావరణం కోలాహలంగా వుంది.

పెళ్ళి పెద్దలు హడావుడిగా తిరుగుతున్నారు. మరి కొందరు కబుర్లు చెప్పుకుంటున్నారు. యివేమీ పట్టనట్లు పిల్లలు, గంతులేస్తూ అల్లరిచేస్తున్నారు. బ్రాహ్మణులు మంత్రాలు పఠిస్తూ తమ కర్తవ్యం నిర్వహిస్తున్నారు.

యీ కోలాహలం కన్నా మిన్నగా భజంత్రీలు తమ వాయిద్యాలకు పని కల్పించారు.

సన్నాయి గొంతెత్తింది. వాయిద్యాలన్నీ పందిట్లో మంగళదాయకమైన వాతావరణాన్ని సృష్టించినై ...

"మాంగల్యం తంతునానేన మమజీవన హేతునా-
కంఠే భద్నామి శుభగే త్వంజీవ శరదాం శతం—"

మంగళ సూత్రధారణ జరిగింది. పెళ్ళికూతురు విజయ సిగ్గుల నిగ్గుల మొగ్గే అయింది... పందిట్లో క్షణకాలం శుభాక్షతలు గాలిలో విన్యాసం చేసినై. పెద్దలంతా వధూవరుల నాశీర్వదించారు. తర్వాత జరుగవలసిన తంతు జరుగుతూనే వుంది.

పందిట్లో గుంజనానుకుని నిలబడి చెల్లెలి పెళ్ళివేడుక చూస్తోంది శాంత. నలుగురితో బాటు ఆమెకూడ చెల్లిని, వరుడిని మనసారా ఆశీర్వదించింది.

శాంత మూర్తీభవించిన దేవతలా వుంది. ఆమె ముఖంలో సంతృప్తి తొణికిసలాడుతోంది. సంతృప్తివలన ఏర్పడిన ఆనందం ఆమె నేత్రాల్లో ప్రతిఫలించింది. ఆమె కళ్ళలో ఆ నీరు ! !

కన్నీరా ? !... ఆనందపు పన్నీరా ? !

ఆనందభాష్పాలు - సంతృప్తి పుష్పాలు - హడా వుడిగా పందిట్లోనుండి యింట్లోకి వెళ్తూ గుంజవారగా నిల బడి మూర్తీభవించిన దైన్యంలావున్న పెద్దకూతురు శాంతను చూసిన సరస్వతమ్మ హృదయం కలుక్కుమన్నది. ఆమెలో అంత హుషారూ చచ్చిపోయింది. అడుగు తడబడింది. కళ్ళు చెమర్చినై. ఆమె అంతర్గతమైన బాధను పైకి కనబడ నీయకుండా విశ్వప్రయత్నం చేస్తూ నీరసంగా లోపలికెళ్ళి పోయింది.

పెళ్ళి హడావుడిలో వెసులుబాటు దొరకని కాళిదాసు కూడా తన ఆలోచనల్ని, తన దృష్టిని అప్పుడప్పుడూ పెద్ద మ్మాయివైపు మళ్లిస్తూనే వున్నాడు. అలా చేసినప్పుడల్లా ఆయనముఖం గంభీరతను సంతరించుకుంటూనే వుంది. ఆయన గుండె అగ్నిపర్వతం బద్ధలై 'లావా' కళ్ళనుండి ప్రవహిస్తూనే వుంది. ఏదో అదృశ్యహస్తం ఆయన హృదయాన్ని పిండి పిప్పిచేస్తోంది.

'శాంతమ్మ తల్లి నిజంగా దేవత. తమ యిలవేల్పు. ఆమె ఆశీస్సులు, చల్లని చూపూ తమ కుటుంబానికి రక్ష' అనుకున్నాడు కాళిదాసు - పందిట్లో.

'శాంతకు జీవితమే ఒక కఠినశిక్ష. ఆమెకు శిక్షే తమకు రక్షేమో' అని కూడ అనుకోక పోలేదు ఆయన.

ఆ మాట ఆయన మొదటినుండీ అనుకుంటూనే వున్నాడు.

ఎవరో ముత్తైదు దృష్టి శాంతవైపు మళ్ళింది.

'ఆ అమ్మాయికి పెళ్ళి కాలేదుటగా. ఇదేం విడ్డూరం కామాక్షీ... పెద్దమ్మాయిని వదలి చిన్నదాని పెళ్ళిచేయడం ఎక్కడన్నా వుందీ?!' ప్రక్కనే కూర్చున్న మరో సువాసిని చెవులో గుసగుసలాడిం దామె.

'ఆ గడేకారు పిల్లేనా. పేరు శాంతలే. పెళ్ళీలేదు - పెటాకులు లేవు. అదేమి విడ్డూరమో - ఎందుకు పెళ్ళిచేయ లేదో తెలియదు. ముప్ఫయ్యేళ్ళు వచ్చినై.'

'చదువులే యిన్ని అనర్థాలకూ మూలం. మన కాలంలో యిలాగే జరిగిందా. పదిమంది పిల్లల తల్లి కావాల సిన వయస్సు. ఏం విపరీతకాలమో బాబూ. పెళ్ళిచేసుకోక ఏం చేస్తుందట?... లోకం వుద్ధరిస్తుందా?'

'యింకా పెళ్ళేమవుతుందలే... ఆ యీడు పిల్లను ఎవరు చేసుకుంటారు గానీ...'

పెళ్ళి పందిట్లో 'శాంత పెళ్ళి' ప్రధాన చర్చా వస్తు వయింది... పెళ్ళి పందిరి ముత్తయిదువుల పోచికోలు చర్చా వేదిక అయింది.

యింతలో శాంత స్నేహితురాలు నిర్మల వచ్చింది నవ్వుతూ. ఆమె చేతిలో రాధాకృష్ణుల 'ప్లాస్టర్ ఆఫ్ పారిస్' విగ్రహం వుంది.

నిర్మలవస్తూనే 'ఆలస్యమైందే ... సూత్రధారణకూడ అయిపోయినట్లుందే. 'రాధా మాధవ్' విజయకు ప్రెజెంట్ చేద్దాం రా!' అంటూ శాంతను లాక్కుపోయింది.

విజయ పెళ్ళి సలక్షణంగా జరిగిపోయింది. పెళ్ళి హడావుడి సద్దు మణిగింది.

విజయ అత్తగారింటికి వెళ్ళిపోయింది.

కాళిదాసుకు కూతురి పెళ్ళి పూర్తిచేసాననే తృప్తి లేకపోగా... అతని హృదయం రంపపుకోతను గురవుతోంది. తన అప్రయోజకత్వానికి లోలోపలే కుమిలిపోసాగాడు.

పెద్దకూతురు వివాహం చేయకుండా చిన్నమ్మాయిది చేసాడు. శాంతకు వృద్దేశ్యమంటూ వుంటే, వరుడు దొరక్కపోడు. శాంత పెళ్ళిచేసుకోనని నిక్కచ్చిగా చెప్పేసింది.

'భగవంతుడు కొందరి జీవితాల్లో విచిత్రమైన పరిస్థితుల్ని సృష్టిస్తాడు. ఆ పరిస్థితుల్ని ధైర్యంగా ఎదుర్కొని చుట్టూ ప్రశాంత వాతావరణం ఏర్పరచుకోవడంలో ఎన్నో కష్టాలు పడవలసి వస్తుంది. ఆ పరిస్థితుల్ని ఎదుర్కోవడంలో సామూహికంగా ప్రయోజనం చేకూరినా, ఎవరో ఒకరు తమ జీవితాన్ని ఫణం పెట్టక తప్పదు.'

శాంత పెళ్ళిచేసుకోకపోవడానికి, ఆమెలో అలాంటి విరక్తిభావం జనించడానికీ ఒకప్పుడు ఆ యింటి పరిస్థితులే కారణం. ముఖ్యంగా కాళిదాసు బాధ్యుడు.

కాని ఆనాటిపరిస్థితులు అలాంటివి. కాళిదాసు ఆనాడు అన్నివిధాలా అశక్తుడు. చివరికీ యివన్నీ తప్పి తలకెత్తితే

శాంతకు జరిగిన అన్యాయం 'విధిరాత'కు వదలి వేయాల్సి వస్తుంది...

కాళిదాసు జీవితమే బహు విచిత్రమైనది. అతనికి జీవితంలో ఎన్నడూ 'గెలుపు' అనేది తటస్థపడలేదు. జీవితం సృష్టించే సమస్యలముందు అతనెప్పుడూ అనవత శిరస్కుడే. ఎప్పుడూ ఆయన పరాజితుడు.

కాళిదాసు పెద్ద చదువేం చదువుకోలేదు. అలాగని ఆయన చిన్నతనాన ఒట్టి మొద్దూ కాదు. చిన్నతనాన, యింటి పరిస్థితులు ఆయన చదువుకు స్వస్తి చెప్పించినై.

శాంత విషాద జీవితానికి కాళిదాసు బాధ్యుడైతే, కాళిదాసు అస్థిర జీవితానికి ఆయన తండ్రి బాధ్యుడు.

అవసన్న త్యాగం, త్యాగం అని కదంతొక్కి ఏదో వుద్ధరించబోయి జారి తలకిందులుగా పడి తెచ్చుకొన్న కష్టాలు.

కాళిదాసు తండ్రి జానకిరామయ్య. కాళిదాసు తాతల హయాంలో అది బాగా వెలిగిన కుటుంబమేగాని, జానకిరామయ్య బాధ్యతలు స్వీకరించేటప్పటికి ఆ కుటుంబం బాగా యిబ్బందుల్లోనే వుంది. జానకిరామయ్యకు యిద్దరు కొడుకులు, యిద్దరు కూతుళ్ళు. జానకిరామయ్య భార్య అన సూయమ్మ. భర్తను తన చెప్పుచేతుల్లో వుంచుకున్న ఘటికు రాలు. ఆమె గిరిగీచి అది దాటొద్దంటే ఆయన అక్షరాలా పాటించేవాడాయన. ఆమె ప్రతిమాటా ఆయనకు శిలాక్షరమే. ఆయనకు వ్యక్తిత్వం అంటూ ఒకటుండేది కాదు.

పైతృకమైన ఆస్తి రెండెకరాలు మిగిలింది జానకి రామయ్యకు. స్వంతంగా వ్యవసాయం చేసుకోడానికి స్తోమత గాని, ఓపికగానీ లేక ఆ రెండెకరాలూ ఆ వూళ్ళోని బుఢే సాయిబుకు మక్తాకు యిచ్చారు. ఆ రెండెకరాల ఫలసాయం ఒకట్నే వారి కుటుంబ భుక్తికి ఆధారమైతే యిబ్బంది పడే వారేగాని, జానకి రామయ్య వుదయం, సాయంత్రం తన యింట్లోనే వూరి పిల్లలకు చదువు చెప్పేవాడు. ఆ వూళ్ళో సరైన బడి లేకపోవడమే అందుకు కారణం.

ఆ రెండో సంతానం కాళిదాసు, స్వగ్రామంలో విద్యా సౌకర్యం లేకపోవడంవల్ల పక్కనేవున్న రేపల్లెలో బంధువుల యింట్లో వుండి ఫోర్త్‌ఫారం చదువుతుండేవాడు. కాళిదాసు తమ్ముడు సూర్యం అయిదో తరగతి తండ్రి బడిలోనే చదువు కునేవాడు.

కాళిదాసు పెద్ద చెల్లెలు వివాహం అతని చదువుకు దెబ్బకొట్టింది. పెళ్ళికాగానే అల్లుడు యింటికి వచ్చాడు. అల్లుడు ప్రసాదరావుకి తల్లీ దండ్రీ యిద్దరూ లేరు. పెంపుడు తల్లి సుందరమ్మ, ఒక విధవావిడ వుంది. ప్రసాదరావుకూడా ఆ రోజుల్లో ఫోర్త్‌ఫారమ్ చదువుకొంటూ వుండేవాడు. వివాహానంతరం అతని చదువు బాధ్యతమామగారు జానకిరామయ్య గారిపై పడ్డది. కాళిదాసుని ఒక్కడినే రేపల్లెలో వుంచి చదివి స్తుంటే తడిసి తట్టెడంత అవుతోంది. యింకా కొన్నాళ్ళుపోతే సూర్యాన్నికూడా హైస్కూల్లో జేర్చాలి. చిన్నమ్మాయి పెళ్ళి అలాగేవుంది. ఒళవైపు బాధపట్టూనే భార్యతో సంప్రదించాడు ఆ విషయం.

'యిక పెద్దవాడి చదువు ఆపి అల్లుణ్ణి చదివించండి' అన్నదామె.

కాళిదాసు ఫోర్త్‌ఫారంతో ఆగి వెనక్కి వచ్చేసాడు... ఆ స్థానే ప్రసాదరావు చదువు సాగించాడు. కూతురు జీవితం దృష్టిలో వుంచుకుని మురిసిపోయిన అనసూయమ్మకు కొడుకు భవిష్యత్తుమాట తట్టలేదు.

కాళిదాసు నాలుగేళ్ళు ఏ వ్యాపకం లేకుండా యింట్లోనే గడిపాడు. తాడి చెప్పే పిల్లలబడిలో కాలక్షేపం.

ఆ తోటి మనిషికి, ఆ తోటి చదువుకి పెళ్ళే తక్కువైనట్లు కాళిదాసుకు పన్నెండేండ్ల సరస్వతమ్మతో పెళ్ళికూడ చేసారు.

అప్పుడప్పుడే అతనికి జీవితమంటే తెలిసివస్తున్నది. కాళిదాసుకు భవిష్యదాలోచన మొదలయింది. ప్రసాదరావు స్కూలుఫైనల్ రెండుసార్లు తప్పి యింట్లోనే వుంటున్నాడిప్పుడు. లేనిపోని గౌరవం అల్లుడికి ఆపాదించడం, కొడుకును న్యూనతపరచడం చేసేది అనసూయమ్మ.

సూర్యం ఫోర్తుఫారంలోకి వచ్చాడు. తెలిసినవారి ద్వారా ఎలాగో తంటాలుపడి రేపల్లెలోనే ప్లీడరు గుమాస్తాగిరీ సంపాదించాడు కాళిదాసు. ఫోర్తుఫారం చదివినవాడికి ఆ రోజుల్లో అదన్నా దొరికిందిగాని, ఈ రోజుల్లో అయితే చాలా యిబ్బందులు పడవలసి వచ్చేది. నెలకు యిరవై రూపాయలు యిచ్చేవారు.

ఆ యిరవై రూపాయల్లో తనను పోషించుకుంటూ తండ్రికి అయిదురూపాయలు యిచ్చిన బుద్ధిమంతుడు ఆ

రోజుల్లో కాళిదాసు. గొర్రెతోకలాంటి ఆనౌకరీ ఎన్నాళ్ళని. ప్రక్కనేవున్న మరోవూళ్ళో దేవస్థానపు గుమాస్తాగా చేరాడు కాళిదాసు. అక్కడ మరో పది రూపాయలు ఎక్కువ యిచ్చే వారు. దేవస్థాన గుమాస్తాగిరీ చేస్తూ ఆ వూళ్ళో కాపరం పెట్టాడు. ఆ వచ్చేకాస్తా వారిద్దరికీ సరిపోయేది. యింటికి యిదివరకులాగా సర్దగలిగేవాడు కాదు.

ఆవూళ్ళోనే పరిచయమైన ఒక పెద్దమనిషిద్వారా బావ మరిది ప్రసాదరావుకు గంటూరులో ... ఆఫీసిలో వుద్యోగం ఇప్పించాడు. మూడు, నాలుగేళ్ళు చేసేటప్పటికి కాళిదాసుకు ఆ వుద్యోగంమీద కూడ మొహం మొత్తింది... ప్రయత్నం చేయగా బెజవాడలో ఫౌండ్రీలో స్టోరుసక్లర్కుగా వుద్యోగం వచ్చింది. యాభై రూపాయలు యిచ్చేవారు.

కాళిదాసు బెజవాడకు మకాం మార్చాడు. అటు సూర్యం స్కూలుఫైనల్‌లోకి వచ్చాడు... కాళిదాసు కొత్తగా చేరిన ఫౌండ్రీ సుబ్రమణ్య అయ్యర్ అనే మదరాసీది.

కాళిదాసుపై కొద్దిరోజుల్లోనే అతనికి మంచి అభిప్రాయం ఏర్పడ్డది. అతను చేరిన సంవత్సరం వ్యాపారంలో ప్రతి సంవత్సరంకన్న అయిదు వేలు లాభించింది అయ్యర్‌కి.

కాళిదాసు జీతం డెభ్భైచేసాడు అయ్యరు.

సూర్యం స్కూలుఫైనల్ వుత్తీర్ణుడయ్యాడు. గుంటూరులో బావమరిది దగ్గరవుంచి, సూర్యాన్ని కాలేజీలో చేర్పించాడు కాళిదాసు. అటు ఒక అర ఎకరం పొలం అమ్మి జానకరామయ్యా కడగొట్టు పిల్ల పెళ్ళిచేసాడు. ఆ చిన్నల్లుడు

మటుకు దగ్గర్లోనే గ్రామ కరణీకం చూసుకుంటున్నాడు. అతనికి వుద్యోగం చూడాలనే బాధ, బాధ్యతలు ఏవీ లేవు.

కాల చక్రం గిర్రున తిరిగింది.

యీ మధ్యకాలంలో ఆ కుటుంబంలో ఎన్నో మార్పులువచ్చినై. సూర్యం బి. యే, వుత్తీర్ణుడై బ్యాంకులో చేరాడు గుంటూరులోనే. స్వగ్రామంలోని పొలం, బుడే సాయిబుకు మక్తాకు పారేసి జానకిరామయ్య, అనసూయమ్మ చిన్న కొడుకు దగ్గర వుంటున్నారు.

యిన్ని సంవత్సరాలూ కాళిదాసు తమ్ముడి కాలేజీ చదువుకు ఆర్థికంగా సహాయపడుతూ తన భవిష్యత్తుకై ఏమీ కూడబెట్టుకోలేక పోయాడు. యిద్దరు కూతుళ్ళు పుట్టారు. సంసారం రెట్టింపు పెరిగింది. సంసార సభ్యుల సంఖ్యతోబాటు ఖర్చూ రెట్టింపు పెరిగింది. సూర్యం పెళ్ళీ తన బాధ్యతతోనే జరిపించాడు. బుడే సాయిబు దగ్గర కొంత డబ్బు అప్పు తీసుకొని తను కొంత వేసుకొని ఆ శుభకార్యం పూర్తి కానిచ్చాడు.

యిప్పుడు కాళిదాసుకు ముప్పై అయిదేళ్ళు... యిద్దరు కూతుళ్ళుగాక మళ్ళీ ఒక కొడుకు ఒక కూతురు పుట్టారు.

అక్కడినుండీ కాళిదాసుకు అసలయిన అగచాట్లు మొదలయినై.

'కొందరి జీవితాలు అలాగే ఎదుగూ బొదుగూ లేకుండా వెళ్ళిపోతాయ్. అలాంటివ్యక్తులు మరోపరిసరాల్లో జన్మిస్తే రాణించేవారేమో ననిపిస్తుంది. ఎప్పటికప్పుడు వాళ్ళను వేధించేపరిస్థితులు వారిని మెసలనివ్వక, అర్థంలేని

బాధ్యతల సరీసృపాలు వారిని కాటువేసి బుసలుకొట్టుంటే వారి జీవితం శాపగ్రస్తమైనదేమో ననిపిస్తుంది.

ఇప్పటివరకూ ఏ పరిస్థితులు, బాధ్యతలు మొహమాటాలూ సృష్టించిన సాలెగూడులాంటి జీవితంలో చిక్కుకుపోయి ఉక్కిరి బిక్కిరయిన కాళిదాసు ఎలాగో మెల్లిగా చిక్కు తప్పించుకొని బయటపడుతుండగా కొత్తసమస్య ఎదురైంది.

కొన్ని రోజుల తరబడి వీపుమీద వెన్నముక పక్కగా విపరీతమైన నొప్పి వచ్చేది కాళిదాసుకు. ఏదో నొప్పిఅని అశ్రద్ధచూపిన కాళిదాసు వున్నట్టుండి ఆఫీసులో పనిచేస్తుండగానే నొప్పివచ్చి కూలబడిపోయాడు. సంగతి, సందర్భం తెలుసుకున్న అయ్యర్ తెలిసిన డాక్టరును పిలిపించి చూపించాడు.

వెన్నముక పక్కగా లోపల పెద్ద కురుపు వున్నదని, మరో రెండుమూడు రోజుల్లో అది పెద్దదై వెన్నముకలోకే చొచ్చుకుపోయే ప్రమాద మున్నదని, అది ఆపరేషన్ చేయకపోతే ప్రాణానికి ముప్పమని చెప్పాడు. తాత్కాలికంగా ఏదో యింజక్షన్ యిచ్చాడు.

చేతిలో డబ్బులేదు. ఉన్నది కాస్త తమ్ముడి పెళ్ళికి ఖర్చుకాగా యింకా అప్పుల్లో తేలాడు. తమ్ముడుగాని, బావమరిదిగాని సహాయం చేస్తారేమో కబురు పంపమన్నది ఆశతో. ఆఫీసుమనిషినే గుంటూరు పంపగా సాయంత్రంకల్లా తిరిగి వచ్చాడు అతను. తమదగ్గర డబ్బెక్కడిదని అన్నారట.

కాళిదాసు మొదటిసారిగా తనమంచి తనానికి విలువ ఎంతో తెలుసుకో గలిగాడు. వెంటనే కురుపు ఆపరేషన్ జరిగిపోవాలి. లేకపోతే ప్రాణానికే ముప్పం. తను పోయేది పోక వెనుక నాలుగు ప్రాణుల్ని నిరాశ్రయుల్ని చేయాల్సి వస్తుంది.

సరస్వతి మెళ్ళో పుట్టింటి వారిచ్చిన ముప్పేటల గొలుసు వుండేది. బంధువులు ప్రేమలు, విశ్వాసాలూ, చంపుకున్నారు. కానీ సరస్వతి భర్త స్వస్థతకోసం ఆ భరణాలపై మక్కువ చంపుకొని గొలుసూ, మరో రెండు జతల గాజులు అమ్మి డబ్బు యిచ్చింది. "తన జీవితానికి భర్తే ఒక ఆభరణం. ఆయన చల్లగావుంటేనే తనకూ ఆభరణాలూ, ఆడంబరాలున్నూ – ఆయనే లేకపోతే యింక వాటి విలువా, ప్రయోజనమూ రెండూ వుండవు" అనుకున్నది సరస్వతమ్మ.

అనుకున్నట్లే అయ్యర్ స్నేహితుడి దగ్గరే ఆపరేషన్ జరిగింది. చాలా రక్తమూ పోయింది కాళిదాసు శరీరం నుండి. కురుపు చితికి చాలా విషపు రక్తమూ, చీమూ బయటకు వచ్చేసింది. ఆపరేషన్ చేసి డాక్టర్ బయటకువచ్చి సరస్వతమ్మతో, 'మీరు చాల అదృష్టవంతులమ్మా!... యిరవై నాలుగు గంటలు జాప్యంచేస్తే కాళిదాసుగారు మనకు దక్కేవారు కారు' అన్నాడు చాల సంతోషం వ్యక్తపరుస్తూ.

అయ్యర్ చాల ఆనందిచాడు. సరస్వతమ్మ మనసులోనే మనసారా సమస్త దేవతలకూ నమస్కరించింది.

ఆపరేషన్ జరిపించడం ఒక ఎత్తు, జరిగిన తర్వాత కాళిదాసు పోషణ ఒకఎత్తూ అయింది. రక్తం తగ్గిపోవడంతో

మనిషి డీలాపడిపోయాడు. టానిక్‌లకూ, పళ్ళూ, ఫలాలకూ బోలెడు డబ్బు కావాలి. ముప్పేట గొలుసూ గాజులూ అమ్మిన డబ్బు ఆపరేషన్‌కీ, మొదటి విడత మందులకూ సరిపోయింది.

పరిస్థితి గ్రహించిన అయ్యర్, కాళిదాసుకు ఆ నెల పనిచేయకపోయినా ముందే డబ్బు యిచ్చేసాడు. ఆ దెబ్బ నుండి కోలుకునేప్పటికి రెండు నెలలు పట్టింది.

ఆరోగ్యం కుదుటపడగా తిరిగి షాంగ్రీలో ప్రవేసించాడు కాళిదాసు.

♦ ♦ ♦

అదంతా పదేళ్ళ క్రితంమాట...

అయ్యర్ అదృష్టమో, కాళిదాసు-అదృష్టమో గాని అయ్యర్ వ్యాపారం ఆశించనంత అభివృద్ధి చెందింది.

ఆఫీసు బెజవాడనుండి హైద్రాబాదుకు మార్చాడు అయ్యర్. జీతం పెంచాడు. అంతా మూడొందలు యిచ్చే వాడు. యాభైరూపాయలలో భుక్తిగడవక చేరిన కాళిదాసు జీవనపరిమాణం పెరగడంవల్ల అదృష్టరేఖ మళ్ళడంవల్ల మూడొందల జీతగాడయ్యాడు.

సంవత్సరం తేడాలో కాళిదాసు, తల్లీ దండ్రీ లోకం విడచి శాశ్వతంగా వెళ్ళిపోయారు. స్మారకంలేక పడివున్న జానకిరామయ్య వేలిముద్ర పెట్టించి ఆ పొలమూ, యిల్లూ అల్లుడు ప్రసాదరావు భార్యపేర రాయించి, ప్లీడరుకు ఒక వందరూపాయలు పారేస్తే పని పూర్తిచేసుకున్నాడు. కాళిదాసు హైద్రాబాదునుండి వెళ్ళేటప్పటికి పనంతా అయి

పోయింది. అంత్యక్రియలు జరిపించి, మాగుమాటాడకుండా తిరిగి వచ్చేసాడు కాళిదాసు.

అతనికెన్నడూ ఆ స్త్రీమీద మమకారం లేదు. అతనికి ఆశా యీర్ష్యా వున్నట్లయితే చిన్నప్పుడు తన చదువు మాన్పించి శావమరిదికి జీవిక కల్పించిననాడే ఎదురుతిరిగి పోట్లాడేవాడు. ఎప్పుడూ అతన్ను అందరినుంచినీ, క్షేమాన్నే కోరాడు. లేకపోతే పదిహేను రూపాయలు సంపాదించే రోజుల్లో అయిదురూపాయలు యింటికి పంపేవాడేకాడు. తన చదువును, తన జీవితాన్ని నిర్లక్షించిన తండ్రికి, తమ్ముడికు చదువుకోసం డబ్బు పంపేవాడేకాడు...

"కర్తవ్యం, ధర్మం అని లేనిపోని మొహమాటాలకు పోయినవాడెవ్వడూ బాగుపడలేదు. ఎంత దగ్గరవాడైనా అవసరం తీరేవరకూ కబ్బం గడుపుకుని తను చేయాల్సి వచ్చినపుడు మొండిచేయి చూపించేరకమే. కర్తవ్యం, ధర్మంపేర జీవితాన్ని నాశనం చేసుకొని యిహాన్ని నరకతుల్యం చేసుకోడం మూర్ఖత్వం. బతికినన్నిరోజులూ బాధపెట్టే, ఆ కర్తవ్యం ధర్మం కేనికోసం? చచ్చినతర్వాత పరంలో వస్తుందనే ఆ సంతోషంకోసం జీవితాన్ని ముళ్ళబాటగా చేసుకోడం తెలివితక్కువ."

యిప్పుడు పెద్దకూతురు శాంత బి. యే. చదువుతున్నది. రెండో పిల్లాడు స్కూలుఫైనల్ చదువుతున్నాడు. మూడో అమ్మాయి విజయ థర్డ్‌ఫారమ్ చదువుతున్నది. మిగతా పిల్లలు చిన్న చిన్న క్లాసులు చదువుతున్నారు.

జీవితంలో వెలుతురు చూపించినట్లే చూపించి అక

స్మాత్తుగా విధి కాళిదాసుపై దెబ్బకొట్టింది. ఫాం డీ వ్యవహారం అయ్యర్ పోగా, అయ్యర్ అల్లుడు చూసుకుంటున్నాడు.

అకస్మాత్తుగా కాళిదాసుకు పక్షవాత మొచ్చి మంచానపడ్డాడు. ఎడమకాలు, ఎడమచెయ్యి రెండూ పట్టుతప్పి నిర్జీవమైన కట్టెల్లాగా అయినై. సరస్వతమ్మ గుండెల్లో రాయి పడ్డది... యిన్నాళ్ళూ పిల్లల చదువులమీద, సంసార సంరంభానికి, జీతం ఏ నెలకా నెల ఖర్చయిపోతూనే వుంది. వున్నట్టుండి యీ వైపరీత్యం సంభవించింది. చేతిలో చిల్లిగవ్వ లేదు. చేతికందివచ్చే సంతానం లేదు. వున్నపిల్ల చదువే పూర్తికాలేదు. శాంత మొదటి ఏడు బి. యే. పరీక్ష యిచ్చింది. పిల్లాడ్లు అంది వచ్చేటప్పటికి చాల సంవత్సరాలు పడుతుంది.

శాంతను బాగా చదివించి, చదువుకున్నవాడి కిచ్చి పెళ్ళిచేయాలని కాళిదాసుకోర్కె. దేముడులాంటి అయ్యర్ని దేముడే తీసుకుపోయాడు. తన జీవితంలో వెలుగురేఖ ప్రవేశ పెట్టి వున్నట్టుండి అంతా అంధకారమయం చేసాడు.

రెండునెలలు పనిచేయకుండానే జీతమిచ్చేడు అయ్యర్ అల్లుడు, తన మామగారితో కాళిదాసు స్నేహాన్ని పురస్క రించుకుని.

యింగ్లీషు మందులు వాడాలంటే వందలకు వందలు డబ్బు ఖర్చుపెట్టాలి. వాడిన ఆయుర్వేదపు లేహ్యాలతో పడిపోయిన కాలూ చేయి బలం పుంజుకో లేదు. యీ విషయంలో తమ్ముడికిగాని, బావమరిదికిగాని రాయడం, వారి

సహాయాన్ని అర్థించడం దాని ఫలితం ఎంత లాభదాయకమో కాళిదాసుకు తెలుసు. ఆయుర్వేదంమీద నమ్మకంతోనే భవిష్యత్‌పై ఆశతో మంచంలో పడుకొని కలలు కంటున్నాడు కాళిదాసు.

ఆశ ! మానవ మనుగడకే కారణమైన ఆశ !!

♦ ♦ ♦

కాళిదాసు మంచంలో పడుకొనివున్నాడు. సరస్వతమ్మ పక్కనే స్టూలుమీద కూర్చుని ఎడమచేతిని చేతిలోకి తీసుకొని తడుముతూ 'యిదివరకటికన్నా కొంత నయమేనని పిస్తోందండీ, కొద్దిగా ఎత్తి చూడండి వీలవుతుందేమో!' అన్నది.

కాళిదాసు నిర్వర్ణమైన ముఖంమీద మబ్బుచాటున చంద్రుడి మసక వెలుతురిలా నీరసమైన నవ్వు వ్యాపించింది. జవాబు ఏమీ యివ్వలేక పోయాడు.

భర్త మనోగత భావాలను గ్రహించిన సరస్వతమ్మ లోలోన బాధపడ్తూ ఎందుకంత నిరాశపడ్తారు. నా మాట నమ్మండి అప్పటికీ యిప్పటికీ తేడా తెలుస్తూనేవుంది. త్వరలోనే అంతా చక్కబడుతుంది.' అని ధైర్యం చెప్పింది.

భార్య చెప్పిన ధైర్యంతో కుడిపక్కకు తిరిగిపడుకున్నవాడల్లా వెల్లకిలా తిరిగి ఎడమచేతిని పూర్తిగా తీసుకొని లేచి కూర్చోబోయాడు. ఐయినా కుదరలేదు. ప్రయత్నించి అలిసి వెనక్కి వాలిపోయాడు. అనవసర ప్రయాసలవల్ల ఆయాసపడి కళ్ళు మూసుకున్నాడు.

తర్వాత నిట్టూరుస్తూ 'మందు తీసుకురా. వేళయి నట్టుంది' అన్నాడు.

మందు తేనెలో రంగరించి యిచ్చింది సరస్వతమ్మ.

భర్త స్థితి చూచిన సరస్వతమ్మ కళ్ళలో నీళ్ళు తిరిగినై.

ఎందుకో ఆయన పరిస్థితి కొంత మెరుగుగా కనిపించింది ఆమెకు. కొద్దిరోజుల్లో తిరిగి ఆయనకు స్వస్థత చేకూరుతుంది అనే ఆశారేఖ ఆమె వదనంలో మెరిసింది.

కొద్దిసేపు భర్త మొహంలోకి చూస్తూ వుండిపోయిందామె. క్షణకాలం దృష్టిని ఎదురుగావున్న మందుసీసాపైకి గాజు గ్లాసుపైకి సారించి అన్నది "ఎన్నాళ్ళువాడినా చేయికి బలమే రాకపోయె. ఇంగ్లీషుమందులు వాడకూడదూ! సికింద్రాబాదులో దయానిధిగారని వున్నారట. ఆయన హస్తవాసికూడ మంచిదేట. ఆయనకు చూపించుకోండి"

భార్యమాటలువిని కాళిదాసు క్షణకాలం ఆలోచనలో మునిగి జవాబేమీ యివ్వలేకపోయాడు. తర్వాత మందస్వరంతో "పరిస్థితి నీకు తెలియనిదేమున్నది సరస్వతీ. ఇంగ్లీషు మందులు వూరికే వస్తాయా. వాటిని కొనడం ఒకవంతు. తర్వాత డాక్టర్లకు ఫీజు యిచ్చుకోడం మరోవంతు... యిప్పటి మన పరిస్థితిలో అది సాధ్యమైన పనికాదు" అన్నాడు కాళిదాసు.

భర్త జవాబువిని ఆమె బాధపడ్డది. బాధతోపాటు, భర్త నిర్లిప్తతకు చిరుకోపమూ కలిగింది.

'కబుర్లు ఏకోరకంగా కూడదీద్దాం లెండి - ఆరోగ్యం ప్రధానంగాని వస్తువులువుండి ప్రయోజనంలేదు. వెండి గ్లాసులు, ఆ రెండు వెండి కంచాలు అమ్మి యిద్దాం దయానిధిగార్ని కలుద్దాం. త్వరలో నయమవుతుంది.'

'ఆయనను యింటికి పిలిపిస్తే పాతిక రూపాయలు పుచ్చుకుంటాడు ప్రిస్క్రిప్షన్ వేరు. ఖరీదయిన మందులే రాసిస్తాడు. యిప్పుడు ఆయన్ని పిలిస్తే మొట్టమొదటిసారే వంద రూపాయలు అవుతుంది. నీ కంచాలు, గ్లాసులు వారం రోజులు రావు.'

'యింకా శాంత మెళ్ళో నెక్లెస్, నా గొలుసూ, గాజులూ వున్నై. అవి అమ్మి ఎలాగైనా త్వరలో నయం చేసుకునే ప్రయత్నం చేద్దాం... అంతా సుఖంగా వున్నప్పుడు యీ నగలుగానీ, మీరు అవస్థ పడుతుంటే వాటి ప్రయోజనమేమిటీ'

ఆమెకు మరిది సూర్యం మనసులో మెదిలాడు. ఆడబిడ్డ సంసారం జ్ఞాపకమొచ్చింది... వారి స్మృతిలో ఆమె కోపంతో రెచ్చిపోయింది.

'మీరు చేసిన వుపకారమేమన్నా గుర్తుందీ మీ బావమరిదికి. పోనీ అంతదాకా ఎందుకు, మీ తమ్ముడిమాట చెప్పండి. మీరు పిచ్చివారు కాబట్టి వాళ్ళను బాగుచేసారు. మీ మంచితనాన్ని కనిపెట్టి మీ అవసరాల్లో ఆదుకొనేదెవరిప్పుడు. మీరు ఒకరున్నారనైనా వారి అజలేనట్టుంది, చూస్తుంటే.'

కాళిదాసు మారు మాటాడలేదు. భార్య బాధలో ఆ మాటలు అనినా, ఆమె మాటల్లోని సత్యం ఆయనకు తెలుసు. నిజంగా తన మంచితనం తనకు వుపయోగపడడం లేదు అనికూడా గ్రహించాడాయన.

"గొలుసులు అవీ చేయించి సంవత్సరం తిరగలేదు. వాటిని అమ్మడం నాకు యిష్టంలేదు. యిహ యీ కాలూ చెయ్యీ అన్నావ్, మందు వాడుతూనే వున్నాం. కొంత తారుగుకూడా కనబడింది. ఏదో ఒకటే పద్ధతిలో వుండాలి కాని, రోజుకొక వైద్యంచేస్తే అసలు తగ్గదు" అన్నాడు కాళిదాసు.

'మీరెన్నన్నా చెప్పండి! మీమాట ఏ విషయంలో నైనా కొనంటాగాని, యీ విషయంలో మాత్రం నే నొప్పు కోను. యిన్నాళ్ళు ఏవో మాటలుచెప్పి నన్ను మభ్య పెట్టారుగానీ, యిహ వూరుకొనేది లేదు. దయానిధిగారికి కబురు పెడ్తాను రేపు. తర్వాత భగవంతుడున్నాడు'

భార్య ఆదుర్దా కాళిదాసు గ్రహించ గలిగాడు. విహ్వల హృదయంతో కలత చెందిన మనసుతో కొంతసేపు ఎటో చూస్తూ గడిపాడు. యిహ భార్య మాటను కాదనే ధైర్యం ఆయనకులేదు. ఇంగ్లీషువైద్యం భరించడమూ చాలా కష్టమనీ ఆయనకు తెలుసు.

'సరేలే...అలాగే చేద్దాం!' అని అనగలిగా డాయని చివరికి.

◆ ◆ ◆

శాంత ఫస్టియర్ బి. యే. పరీక్ష రాసింది. పిల్లల కందరికీ సెలవలు కావడంవలన యింట్లోనే వుంటున్నారు. భర్త మంచం పక్కనే కూర్చున్న సరస్వతమ్మ శాంత జ్ఞాపకంరాగానే గంభీరవదనంతో 'క్రిందటేడు శాంత పెళ్ళి చెయ్యండీ అంటే బి. యే మధ్యలో ఆపడం దేనికి - బి. యే కాగానే చేద్దాం అంటిరి. మధ్యలో యీ అవాంతరం వచ్చి పడె. చేతిలో పైసాలేకపోయె. దానిపెళ్ళి ఎట్లా గట్టెక్కను!!' అన్నది విసుగుతో.

కాళిదాసు మొహంమీద నల్లటినీడలు తారట్లాడినై. హీనస్వరంతో, తన ఆర్థిక కల్లోలానికి బాధపడ్తూ 'వున్నట్లుండి యిదొకటి వచ్చి పడిందాయె. నేను కలగన్నానా... చదువుతూ చదువుతూ ఆపేయడం ఎందుకని అన్నానుగాని, భగవంతుడు దయతలిస్తే తగ్గిపోగానే దాన్ని ఒక అయ్యి చేతిలో పెట్టాలి' అన్నాడు.

'అసలు యింతచదువు ఎందుకని మొదటే చెప్పాను. బియ్యే చదివిన పిల్లని, అంతకన్న తక్కువ చదివినవాడెవడూ చేసుకోడు. ఆ ఫాయీలో సంబంధం రావాలంటే, తగ్గ కట్నమూవుండాలి. ఎంతచెట్టు కంతగాలి. దాని పెళ్ళి యింకా జాప్యం చేయడానికి వీలులేదు. పులిపాకవారి అబ్బాయి యింజనీరింగ్ చదువుతున్నాడన్నారు. ఆయన మీరు ఉత్తరాలుకూడ రాసుకున్నారు కూడాను... మళ్ళీ కదిపిచూడండి' సరస్వతమ్మ అంటుండగానే శాంత ఆ గది లోకి వచ్చింది.

వికసించిన గులాబిలా వుంది ఆమె వదనం. వయసు

తెచ్చిన మార్పు స్పష్టంగా కనిపిస్తున్నది ఆమె మొహంలో. కాళిదాసు కూతురి ముఖంలోకి చూస్తూ వుండిపోయాడు కొంతసేపు. తర్వాత ఆప్యాయత వెల్లివిరిసే స్వరంతో 'తల్లీ! కా_స్త కాగితం, కలం తెచ్చుకుంటావు. ఆఫీసుకు దరఖాస్తు రాద్దువుగాని' అన్నారు.

శాంత వెళ్ళింది. భార్యవైపు తిరిగి 'అమ్మాయికి యీ ఏడు పెళ్ళిచెయ్యాల్సిందే సరస్వతీ... యిక ఆలస్యం చేయ కూడదు' అన్నాడు.

భర్త మాటల్లో నిరాశ, నిర్వేదం గ్రహించిన సరస్వ తమ్మ స్నేహార్ద్రమైన స్వరంతో 'మీకు తగ్గిపోనీయండి... ముందు మీ ఆరోగ్యం ముఖ్యం. యీ సంవత్సరం కాక పోతే వచ్చేసంవత్సరం చేద్దాం. యివన్నీ ఆలోచించక ముందు మీ ఆరోగ్య విషయం ఆలోచించండి.' అంటూ వుండగానే శాంత కలం కాగితంతో ప్రవేశించింది.

♦ ♦ ♦

శాంతకు పడుకున్నా నిద్ర రావడంలేదు. ఎంతకీ తండ్రి ఆఫీసుకి వ్రాయించిన దరఖాస్తుసంగతే గుర్తువస్తోంది. ఆమె మనసు కల్లోలితమై నిర్వేదజ్వాలలో దగ్ధమైపోతోంది. ఎంత వద్దనుకున్నా హృదయపు ఆ దరఖాస్తు ఆమె దృష్టినుండి మరల్చుకోలేక పోతున్నది.

జబ్బు తగ్గగానే డ్యూటీలో చేరుతాననీ, చాల యిబ్బందులు పడుతున్నాననీ, ఒక నెల జీతం అడ్వాన్సుగా యిప్పించమనీ వ్రాయించారు. అందులో యింటి పరిస్థితి అంతా ఏకరువుపెట్టారు. పెళ్ళికావల్సినపిల్ల యింట్లో వున్నదని,

తన కాలు, చేయి పడిపోయి, కుటుంబ భవిష్యత్తే అంధకార మయమైపోయిందని ఏవో రాయించారు.

అదంతా తలపుకురాగానే శాంత మనసు పరి పరి విధాల పోయింది. ఆమె ముఖంలో వుదాసీనత వ్యాపించింది. వ్యాకులపాటుతో లేచి తన డైరీతెచ్చి అందులో యిలా రాసింది.

'దరఖాస్తు సంతకం పెట్టేటప్పుడు నాన్నగారి చేయి వణికింది. అది రాస్తున్నంతసేపు నన్ను చూస్తూనే వున్నారు. బహుశాః తన పెద్దకూతురు యింత త్వరగా పెరిగి గుండెల మీద కుంపటిలాగా అయిందనేమో ఆయన బాధ. ఆయన మనసులోని భావన అదే అయివుంటుంది. ఆయనకు తన ఆరోగ్యంకన్నా నా వివాహం విషయం ఎక్కువగా ఆలో చిస్తున్నారని తోచింది. ఆయన చేయి వణకడానికి కూడ అదే కారణం. ఆ రోజు అమ్మకూడ అన్నది ఒకసారి. 'శాంతమ్మతల్లి మొగవాడుగా పుట్టినట్లయితే, యింత యిబ్బంది వుండేదికాదు. యిప్పుడు ఆయన మంచంలో కూడ దాని పెళ్ళివిషయమే ఆలోచిస్తున్నారు' అని.

ఆ మాట ఎవరితోనో అంటూవుండగా తను రావడం తటస్థించింది. ఆ మాటలు విన్న తను అప్రతిభురాలయి పోయింది. తననిచూసి నవ్వుతూ మరో విషయంలోకి మార్చింది సంభాషణను అమ్మ. ఎంతతప్పించుకుందామను కున్నా ఆ విషయంమాత్రం యదార్థం. ఆమె హృదయంలో నుండి బయటపడిన సత్యం అది.

నిజమే. మగపిల్లవాడుగా పుట్టినట్లయితే, ఏవో

వుద్యోగం చేసి తండ్రి కష్టకాలంలో ఆదుకునేదాన్నే...
స్త్రీగా పుట్టడం-తల్లిదండ్రులకు బరువుచేసేనా ! మరి తను యింతచదువు చదివినదీ జ్ఞానసముపార్జన కోసమేనా? కష్టాల్లో అవసరంరాని యీ చదువు ఎవరిని వుద్ధరించను.

లేదు స్త్రీజాతి ప్రగతిపథంలోకి పయనిస్తోంది. వంట యిల్లుదాటి మరో ప్రపంచం తెలియని స్త్రీ గాదు యీనాటి స్త్రీ. పురుషుడితో సమంగా అన్ని రంగాలలో పురోగమిస్తున్నది. నేనూ సబల అని నిరూపించుకుంటాను. నాన్నకు ఏ లోటూ లేకుండా చేస్తాను. యింతచదువు చదివీ నాన్నను అగచాట్లు పడనివ్వను...

  

కాళిదాసు నాలుగు నెలలలోనే ఎముకల గూడులా తయారయ్యాడు. సరస్వతమ్మ చేతులవీ, మెడలోవీ ఒక్కటొక్కటే వదిలించుకుని కాళిదాసు స్వస్థతకోసం ప్రయత్నం చేస్తోంది.

డాక్టర్ దయానిధికి కబురుపంపితే వచ్చి చూచి, మందులు రాసిచ్చి వెళ్ళాడు. గొలుసుఅమ్మిన డబ్బుతో మందులు తెప్పించింది సరస్వతమ్మ.

కాళిదాసుకు భార్య ధోరణి బాధాకరంగానే వుంది. వద్దంటే వినదు. ఆ ఆయుర్వేదం వాడితే అదే తగ్గిపోతుందంటే, డబ్బు తగలేయడంలోనే ఆనందం అంటుంది.

కాళిదాసు యింగ్లీషుమందు వద్దని ఎప్పుడు మారాం చేసినా, సరసర్వతి ఆయన కళ్ళల్లోకి చూస్తూ నిరుత్తరగా నిలబడుతుంది. ఆయనను చూస్తూ వుండగానే ఆమె కళ్ళ

నుండి ముత్యాలురాల్తాయ్. ఆమె చెమర్చిన కళ్ళు కాళి దాసును స్తబ్దుణ్ణి చేస్తాయ్. యికి అంతటితో అతను మారాంతు స్వస్థిచెబుతాడు.

చెమర్చిన కళ్ళను తుడుకుంటూ 'యింగ్లీషుమందులు వాడను అని మంకుపట్టుపడ్తే నేనూ భోజనం చేయను. మీ కది యిష్టమైతే, మీకు తోచినట్టే చేయండి' అని మరో బాణం విసరి చిరుకోపం అభినయిస్తుంది. అంతటితో కాళి దాసు యిక ఆమె మాటకు ఎదురుచెప్పను అనుకుంటాడు.

దయానిధి వైద్యం మొదలుపెట్టిన తర్వాత ఒకరోజు.

సరస్వతమ్మ గాజుగ్లాసులో మందు పోసుకొనివచ్చి, గ్లాసు పట్టుకొన్న చెయ్యి ముందుకుచాచి 'మందు తీసుకోండి!' అన్నది.

కాళిదాసు మాగన్నుగా పడుకొనివున్నాడు. భార్య మాటలు వినబడలేదు ఆయనకు.

'అయ్యో. నిద్రపోతున్నారా !'

కాళిదాసు బద్ధకంగా కళ్ళుతెరచి కుడిచేతిమీదుగా లేచి కూర్చుందామని ప్రయత్నించాడు. లేవలేక మళ్ళీ వెనక్కు వాలిపోయాడు.

సరస్వతమ్మ ఆదుర్దాగా గ్లాసు పక్కనేవున్న స్టూలు మీద పెట్టి కాళిదాసుని పట్టుకొని, నుదురు పట్టిచూస్తూ— 'ఎలా వుందండీ... అయ్యో ఏమిటీ అలా పడిపోయారూ !' అన్నది.

'భయమేం లేదులే... పట్టు తప్పిపోయింది. నిద్ర మత్తు - పూర్తిగా వదలలేదు'

కాని కాళిదాసు స్వరంలో ప్రతిధ్వనించిన నిరాశా, నిర్లిప్తతలు సరస్వతమ్మ గ్రహించకపోలేదు. ఆమె కలవరపడి పోయింది.

అనుకంప వెల్లివిరిసే స్వరంతో 'కాదు. మీ వంట్లో బాగా లేదు యివాళ, మీకు నిజంగా ఎలావుందీ చెప్పండి దాచకుండా. మొహంకూడా ఎండిపోయివుంది' అన్నది సరస్వతమ్మ.

'మరేంలేదు. పులిపాకవారు ఉత్తరం వ్రాశారు. వాళ్ళబ్బాయికి మరో సంబంధం నిశ్చయమయిందట.' అన్నాడు కాళిదాసు క్షీణస్వరంతో.

'ఆం... ఎందుకు!...'

ఆమె వేసిన ప్రశ్నకు కాళిదాసు జవాబు యివ్వలేదు. సరస్వతమ్మకే తెలుసు జవాబుకూడ... 'కలిమిలేములకు పాత్రుడుదరదని'

'ధర్మానికి, నిజాయితీకి లోకంలో స్థానంలేదు' అనుకున్నదామె.

ధర్మానికి, నిజాయితీకి మారుపేరు తన భర్త.

మరి తన భర్త గతియేమిటి ? తన భర్తకుకూడా సంఘంలో స్థానంలేదా ?

భార్య మాటలు కాళిదాసు వినలేదు. నిశ్చలంగా పైకిచూస్తూ ఆయన తన భవిష్యజ్జీవితంలోకి తొంగి చూస్తున్నాడు.

వారిద్దరిమధ్య కొంతసేపు నిశ్శబ్దం ఆవరించింది.

కుడిచేయి భార్యకు అందిస్తూ లేచి కూర్చోబోయి నాడు. కాని అతనిలో అప్పుడే ప్రవేసించిన బలహీనత ఆ చేతినికూడ ఎత్తనీయలేదు.

భర్త బాధపడ్తున్నాడని గ్రహించిన సరస్వతమ్మ 'యిహ సరేలెండి. జీవితమెప్పుడూ ఒకేరకంగా సాఫీగా సాగుతుందా. యీ కష్టాలు మాత్రం ఎన్నాళ్ళు మనననంటిపెట్టుకొని వుంటయ్. వూరికే అలా యిదవకండి' అన్నది.

భర్తని ధీమాగా అనునయించింది. కాని ఆముఖం వివర్ణమైపోయింది. ఆమె మనసులోనూ "రోజులెలా గట్టెక్కుతాయా" అని అనుమానం సుడులు తిరుగుతూనేవుంది.

యింటి పరిస్థితిఅంతా ఒక్కసారి ఆమె కళ్ళముందు ప్రత్యక్షమై, ఒక్కొక్క సమస్య ఒక పెనుభూతమై కరాళ నృత్యం చేస్తున్నది.

పెళ్ళికావాల్సిన యీడుమీరిన ఆడపిల్ల; చదువుకోవాల్సిన పిల్లలు, మృత్యుగహ్వరంలో పడ్డ కాలూ చేయీ ఆడని భర్త - ఏవిధంగానూ సహాయం చేయలేని స్థితిలో బిగించబడిన తను "హే భగవాన్!... నీకు దయలేదా?" అనుకొన్నది సరస్వతి.

  

శాంత బి. యే. ఫలితాలు వచ్చినై. వుత్తీర్ణురాలయింది. శాంతను రెండోఏడుకూడ చేరమని బలవంతం చేసాడు కాళిదాసు. చేతిలో పైసాలేదుకాని, కూతుర్ని బాగా చదివించాలని ఉబలాటం. తనెలాగూ చదువుకోలేదు

తన బలహీనతవలనో, మరొకరి అశ్రద్ధవలనో, ఎవరితప్పు అయితేనేం తను విద్యావంచితుడు. చక్కగా చదువుకునే తెలివితేటలున్న కూతుర్ని అయినా చదివించి తృప్తిపడదామని ఆయన కోర్కె.

"మీ పట్టుదల మీదేగాని, ఒకరిమాట వినరన్న మాట!" సరస్వతమ్మకు కొంచెం కోపమే వచ్చింది.

"ఇప్పుడు ఏమయిందని. ఎలాగో కష్టపడి చదివిద్దాం. డబ్బు సంగతి భగవంతుడే చూస్తాడు" కాళిదాసు అనునయించబోయాడు.

"మందులకే ఎక్కడెక్కడిదీ చాలడంలేదు. ఇప్పుడు మరో సమస్య!... మీ మాటమీద మీరుండేట్లయితే మా అందరికీ విషం పొయ్యండి గుక్కెడు. మీరూ మీ కూతురూ ఇష్టమొచ్చినట్లు చేసుకోండి" సరస్వతమ్మ వుద్వేగాన్ని అణచుకోలేక పైకే ఏడ్చింది. ఆమె కళ్ళు ముత్యాలు రాల్చినై.

"నీకు తెలియదు సరస్వతీ. నన్ను అర్థంచేసికో. అమ్మాయ్ చదువు మాన్పడంవల్ల ప్రయోజనం లేదు"

"మీరు సమర్థించుకో బోకండి. ఇల్లు గడవడానికే పైసా చేతిలో లేకపోయె. యిప్పుడు యీ ఖర్చు ఎలా భరించేది!!"

"ఏది ఏమైనా సరే - తలతాకట్టు పెట్టయినా దానిని చదివించాలి. యిహ తర్వాత నీ యిష్టం!"

"నా వంటిమీదవన్నీ అయిపోయినై. అమ్మేదామన్నా ఏదీలేదు. ఏమిచేయాలో మీరే చెప్పండి."

"నన్ను ఆ భగవంతుడి దయకే వదిలిపెట్టండి. ఎన్ని మందులు వాడినా తగ్గేసూచనలు ఏవీ లేవు. నాకు వృధాగా మందులు తగలెయ్యక అమ్మాయి చదువు ప్రయత్నాలు చేయించు"

సరస్వతి తన అన్నగారికి డబ్బు పంపమని రాసింది తన అంతరాత్మ అభిమానం చంపుకుని. వెంటనే పంపాడు కూడాను. ఆ సంగతి కాళిదాసుకూ తెలుసు. అందుకే కూతురి చదువు విషయంలో పట్టుదలగా వున్నాడు కాళిదాసు.

"అన్నయ్య డబ్బు పంపాడు. అదే యిప్పుడు ఆదుకుంటోంది. అదికూడ అయిపోయిందంటే ఏ మొహం పెట్టుకుని ఆయనకి రాయాలి ?"

ఆమె హృదయంలోని ఆ వేదన కన్నీరు రూపంలో పొంగి పొరలింది.

"యిటు చూడు సరస్వతీ. నేను అన్నీ ఆలోచించే మాట్లాడుతున్నాను. మన పరిస్థితులేవీ చుట్టు పక్కలవాళ్ళకి తెలియవు. యింకా మనం ఏ యిబ్బంది లేకుండా గడుపుతున్నామనే అనుకుంటున్నారు: అమ్మాయి పెళ్లెప్పుడు చేస్తారంటే "యిప్పుడప్పుడే చేయం - యింకా చదివిస్తాం" అని చెప్పాను చాలమందికి. బి. యే. ఎలాగో ఒక సంవత్సరం అయింది. మరోఏడు. యిప్పుడు మధ్యంతరంగా చదువుకు స్వస్తిచెబితే చదివినదంతా వ్యర్థమౌతుంది. అమ్మాయ్‌ని అప్లికేషన్ పెట్టమను" అన్నాడు కాళిదాసు.

"సరే - అలాగే కానీండి. ఎలా జరగాల్సివుందో అలా జరుగుతుంది"

సరస్వతమ్మ వంటింట్లోకి వెళ్ళి వెంకటేశ్వరస్వామివారి పటం ముందు చేతులు జోడించి శిలావతుగా నిలబడి పోయింది.



సరస్వతమ్మ భర్త మంచం పక్కనే కూర్చుని బత్తాయి పళ్ళు రసంతీస్తోంది. కాళిదాసు పడుకొని భార్యనే చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు. యింతలో చిన్నపిల్లలు యిద్దరూ ఆనందంతో పరుగెత్తుకొచ్చారు. యిద్దరిచేతుల్లోనూ కొత్త పుస్తకాలున్నయ్. కొత్తనోట్పుస్తకాలు కావాలని నిన్నటిరోజున అడిగితే, డబ్బులు యిబ్బందివల్ల తర్వాత కొందాంలే అని సర్ది పంపింది సరస్వతమ్మ పిల్లల్ని. తను డబ్బులివ్వకుండా వీళ్ళకు పుస్తకాలు ఎలా వచ్చినయ్యా అనే సందిగ్ధంలో పడి ఆలోచనలో పడిపోయిందామె.

"అమ్మా యివిగో నోట్పుస్తకాలు. యిహ నువ్వు కొనక్కరలేదమ్మా!" చిన్నపిల్ల దుర్గకళ్ళు మిలమిల మెరిసాయి.

సరస్వతమ్మ హృదయం కలుక్కుమంది, కాతర స్వరంతో "ఆ పుస్తకాలు ఎక్కడివి తల్లీ!" అన్నదామె.

"శాంతక్కయ్య కొనుక్కువచ్చిందే. యిప్పుడే అక్కయ్య వచ్చింది" అన్నారు పిల్లలు.

సరస్వతమ్మ మనస్సులో ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయ్. క్షణకాలం పిల్లల జవాబుకు అవాక్కుగా ఆ పిల్లల మొహాల్లోకి చూస్తూ వుండిపోయింది సరస్వతమ్మ.

"ఆఁ... అక్కయ్యా... అక్కయ్య కొన్నదా..."

అన్నదామె నూతిలోనుండి మాట్లాడినట్లు మెల్లిగా. శాంత ఎలా కొనుక్కువచ్చిందో బోధపడలేదు ఆమెకు.

“మరే... అక్కయ్యేమో నమ్మా... మరేనేమో... మరి... మా యిద్దరికీ వచ్చేనెల ఫ్రాకులు షర్టులూ కుట్టిస్తానంది...” చిన్నపిల్ల దుర్గ మురిసిపోతూ మెలికలు తిరిగిపోతోంది.

కాళిదాసు మంచంలోపడుండి నిర్లిప్తంగా ఆలోచనలో వున్నవాడల్లా వులిక్కిపడి లేచి కూర్చోబోయాడు. కాని లేవలేకపోయాడు. ఆ పిల్లలు చెప్పినవిషయం అలాంటిది ఆయనకు.

ఆయన మనసులోనూ అనుమానాలు మూకవుమ్మడిగా ముసిరినై... శాంతకు డబ్బెక్కడనుండి వచ్చింది అని ఆయన సందేహం.

“శాంతకు నువ్వేమైనా డబ్బిచ్చావావేమిటీ?” హీనస్వరంతో అగాధంలోనుండి మాటాడుతున్నట్లు భార్యను అడిగాడు కాళిదాసు.

“అబ్బే... నేను యివ్వలేదండీ... నాకూ అదే అనుమానంగా వుంది, యివన్నీ ఎట్లాకొన్నదా అని” సరస్వతమ్మ తన సందేహాన్నికూడా వ్యక్తపరచింది.

పిల్లలు వెళ్ళిపోయారు తమ పుస్తకాల్ని చూస్తూ మురిసిపోతూ.

“శాంత వస్తున్నది. మీరేమీ అడగకండి. నేనే సంగతి కనుక్కుంటాను” అన్నది సరస్వతమ్మ భర్తను ఉద్దేశించి మెల్లిగా.

యింతలో శాంత గదిలోకి వచ్చేసింది. ఆమెకూడా బెరుకుగానే వచ్చింది తల్లికి జవాబు ఎలా చెప్పాలా అనీ... తను చేసిన పనిని ఎలా సమర్థించి సర్ది చెప్పాలా అని ఆలోచిస్తూ. బిడియపడిన మనసుతోటే లోపలికివచ్చి తల్లిపక్కగా కూర్చుంది. ఆమె ముఖ కవళికలు మనసులోని దృఢనిశ్చయాన్ని స్పష్టంగా వెలువరిస్తున్నయ్. ఏదో ఒక విషయంలో ఆమె ఏర్పరచుకున్న నిశ్చయమైన అభిప్రాయానికి, మనోస్థయిర్యానికి సాంకేతికంలా వున్నదామె వదనం.

కాళిదాసు కూతురి ముఖాన్నే పరిశీలనగా చూచాడు.

"అమ్మాయ్ !" అన్నది సరస్వతమ్మ తను మాట్లాడబోయేదానికి వుపోద్ఘాతంలా.

శాంత తల్లి ముఖంలోకి చూసింది ప్రశ్నార్థకంగా. తల్లి ఏమి అడుగబోతున్నదో ఆమెకు ముందే అవగతర్థ.

"పిల్లలకు పుస్తకాలు ఎలా కొన్నావమ్మా!" అన్నది సరస్వతమ్మ సాధ్యమైనంత సౌమ్యతను మాటల్లో జోడిస్తూ.

శాంత లిప్తపాటు తలదించేసుకున్నది. లోపల ధైర్యాన్ని కూడదీసుకుని తల యెత్తి "నెలరోజులనుండీ ముగ్గురి పిల్లలకు ట్యూషన్ చెపుతున్నానమ్మా. యివాల్టికి నెల అయింది. డబ్బులొచ్చినయ్" అన్నది శాంత.

సరస్వతమ్మ శిల్పవతుగా కూతురివైపుచూస్తూ వుండిపోయింది. ఏమి మాట్లాడాలోకూడా ఆమెకు తోచలేదు.

"పరిస్థితులు తను వూహించని మలుపులకు గురి అయినపుడు, ఆశించని పరిణామాలు సంతరించుకున్నప్పుడు మనస్సు

తన సహజమైన ఆలోచనా శక్తిని కోల్పోయి స్తబ్దుగా, అచేతనంగా వుండిపోతుంది."

సరస్వతమ్మ పరిస్థితి పై సత్యానికి భిన్నంగా ఏమీ లేదు.

కాళిదాసుకూడా మొదట నిశ్చేష్టుడైనా వెంటనే తేరుకున్నాడు.

శరీరంలోని రక్తం యావత్తూ ముఖంలోకే వచ్చి పోగైనట్లు, కాళిదాసు ముఖం కోపంతో కందగడ్డయింది. పడుకునే ఆపాద శిరోపర్యంతం కంపించి పోయాడు. దిండుమీద ఎగిరెగిరిపడి, ఏదో అదృశ్య శక్తితో కుడి చేతి బలంమీద అమాతం లేచికూర్చున్నాడు.

కూతుర్ని ఎన్నడూ పల్లెత్తుమాట కూడా అని ఎరుగని కాళిదాసు "నిన్ను ట్యూషన్ చెప్పమని ఎవరన్నారు! బుద్దేమైనా వుందా!" అన్నాడు. తమాయించుకున్నాడుగాని, ఇంకా చాలా అనేవాడు.

కాలూ చెయ్యి బాగుంటే కొట్టేవాడేమో కూడా. ఆయన వుద్వేగం అలా వున్నది.

అసలుకు కాలూ చెయ్యి బాగుంటే శాంతకు ట్యూషన్ చెప్పే అగత్యమే కలిగేది కాదు, కాళిదాసుకు కోపమూ రాకపోను.

సరస్వతమ్మకు ఇప్పుడు అర్థమైంది కూతురు రోజూ చీకటిపడి రావడంలోని అంతర్యం.

ప్రతిదినం దీపాలు పెట్టేగాని ఇంటికి రావడంలేదు శాంత నెలరోజులనుండి. కాలేజీలో పనులుంటయ్ లే, ఆడ

గడ మెందుకని వూరుకున్నది సరస్వతమ్మ ఇన్నాళ్ళూ. కాలమే తన అనుమానానికి నివృత్తి చూపించింది.

సరస్వతమ్మ ముఖమూ క్రోధారుణిమ దాల్చింది. ఆమె మనసు అవమానా ఘాతంతో చితికి పోయింది.

"నీకేమైనా మతి తిన్నగా వుందా! ఎన్నడూలేనిది విపరీతపు బుద్ధులు పుడుతున్నాయ్. ఇంకా అమ్మా నాన్నా బతికే వున్నారు. వాళ్ళ వెంబడిపడి అడుక్కోవాల్సిన గతేం పట్టిందే నీకు" వుచ్చైస్వరంతో కూతుర్ని కేకలేస్తూ దుఃఖం పెల్లుబికిరాగా బయటపడే కన్నీటిని పమిట కొంగుతో అద్దుకొని నిశ్శబ్దంగా రోదించింది సరస్వతమ్మ.

ఆమె కోపం కూతుర్ని వదిలి భర్తవైపు మళ్ళింది.

"మీ ముద్దులకూతురి నిర్వాహకం చూడండి. చదువు వద్దూ, ఆ మూడుముళ్ళూ వేయించేయిమని పోరితే నా మాట పెడచెవిని పెట్టారు. ఇప్పుడు సంతోషిస్తారో మీ కూతురి పనులకి తలపట్టుకు కూర్చుంటారో... ఏం చేస్తారో చేయండి 'చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవా!' అన్నారు."

"మీ అమ్మాయి ప్రెవేట్లు చెప్పుతున్నదిటగదా!" అని రేపటినుండి ప్రతివాడూ మిమ్మల్నే అడుగుతాడు. ఏం చెప్పుకుంటారో చెప్పుకోండి. మన దురదృష్టానికి తోడుగా పాడుబుద్ధులు కూడాను. లేకపోతే దీన్ని ఎవరు చేయమన్నారు యిలా. అయినా మనఅదృష్టం యిలావుంది!" అన్నది రోషంతో సరస్వతమ్మ.

భార్య దోషమంతా తనదే అంటున్నది. కూతుర్ని చదివించడం తప్పా? తన ఆరోగ్యం బాగుండి, డబ్బు చేతిలో వుంటే, కూతుర్ని విదేశాలుకూడ పంపేవాడు. తనకు కోరికా, తన కూతురికి అందుకు తగ్గ తెలివి తేటలూ రెండూ వున్నై. కాని విధే బతుకులో వంకరగీతలు గీసింది. సంపెంగల నిలయమని, భ్రమిసిన బతుకులో విషనాగులు నాల్కలు చాచి బుసలు కొట్టినై. పరిమళాలు వెదజల్లే పచ్చటిబతుకు పూదోటలో వాతావరణం విషవాయువులతో కల్మషం అయిపోయింది.

భార్య తప్పు తనపై మోపడంతో, కాళిదాసు మనసులో తర్కం బయలుదేరింది. కూతురిపై కోపం మెల్లిగా చల్లబడింది. కూతురుపై కోపంతో విరుచుకుపడ్డందుకు తనలో తానే సిగ్గుపడ్డాడు.

పిల్లలకు చదువు చెప్పడమేమీ తప్పుపనేకాదు. యిప్పుడు పూర్వపురోజులూ కావు. స్త్రీకి చదువూ, వుద్యోగమూ రెండూ కావాలి. పాత పద్ధతులకు స్వస్తిచెప్పి కొత్త పంథా సంతరించుకున్న యీ ఆధునిక సమాజంలో స్త్రీ పురోగమనం ప్రధానమైనది. కూతుర్ని బాగా చదివించాలనే విశాలహృదయం గల తను, వుద్యోగం చేస్తుంటే కోపంతో చిందులు తొక్కడం దేనికి. ట్యూషన్ చెప్పడంకూడా వుద్యోగమే!" లోలోపలే మథనపడి పశ్చాత్తాపంతో నీరు కారిపోయాడు కాళిదాసు.

అనునయ స్వరంతో "ఎప్పటినుండీ చెబుతున్నావమ్మా." అన్నాడు కాళిదాసు తన ముఖకవళికలు మార్చు

కునేందుకు విశ్వప్రయత్నం చేస్తూ. ఒక్కసారి క్రోధంనుండి సౌమ్యతకు దిగిరావడం కష్టసాధ్యమైన పనే.

సరస్వతి భర్త ధోరణికి చకితురాలయింది. అంత కోపమూ ఎలా చల్లబడిపోయిందా అని ఆశ్చర్యపోయింది.

శాంత, తండ్రి కోపానికి గురి అయినానే అని బాధ పడ్తున్నదల్లా తండ్రి సౌమ్యవాక్కులతో మామూలు మనిషి అయింది. తల్లిఅంటే ఆమెకు పెద్ద భయంలేదు. కోపంలో మొదట విరుచుకుపడినా, చెబితే తర్వాత వింటుంది. భయ పడిన తండ్రి ప్రవర్తనకూడ అనువుగా మారిపోయింది.

సరస్వతమ్మకు భర్త ప్రవర్తనవల్ల ఆశ్చర్యంతో పాటు చిరుకోపమూ కలిగింది.

శాంత ధైర్యం తెచ్చుకుని "సగ్గా నెల అయిందండీ నెలజీతం యివాళే యిచ్చారు. కాలేజీ కాగానే అటునుండి అటే వెళ్ళి చెప్పివస్తున్నాను" అన్నది శాంత.

"ఎవరి పిల్లలమ్మా వాళ్ళు"

"మారేడ్‌పల్లెలో నాన్నా, విశ్వనాధంగారని, కింగ్స్ వేలో పెద్ద ఎలక్ట్రికల్ స్టోర్ కూడా వుందిట ఆయనకు. వారి పిల్లలకి చెప్పమన్నారు. వాకరు ఫిఫ్త్‌ఫారం, యింకో అమ్మాయి ఫోర్త్‌ఫారం, మూడో పిల్లాడు సెకండ్‌ఫారం. ముగ్గురికి కలిపి యాభై యిస్తానన్నారు."

"విశ్వనాధంగారా!" అంటూ క్షణకాలం కాళిదాసు ఆలోచనలో పడిపోయాడు.

"రామానుజంగారి అబ్బాయీ! అవునా!" శాంతకు విశ్వనాధం తండ్రి పేరు, వివరాలు తెలియవు. విశ్వనాధం

బంధువుల అమ్మాయ్ శాంతకు సహపాఠి. ఆమెద్వారా విశ్వనాథంగారి పిల్లల ట్యూషన్స్ దొరికినై. విశ్వనాథం గారింటికి వెళ్ళినప్పుడు ఒక వృద్ధుడు కనిపించేవాడు. "ఆయనే విశ్వనాథం తండ్రి రామానుజం అయి వుండవచ్చు" అను కుంది శాంత.

ఆ విషయమే తండ్రితో చెప్పింది శాంత

"రామానుజంగారిదేట ఆ షాపు వ్యాపారం చేసే వోపిక అంతా కొడుక్కి వప్పగించాడట ఆయన బాగా ఆర్జించిన వారేనే ... ద్రాక్షతోటలు కూడా వున్నై వారికి... బంజారా హిల్స్‌లో రెండు మేడలు, మారేడ్‌పల్లిలో రెండు మేడలు వున్నై. బోలెడు అద్దెలువస్తయ్ వాళ్ళకి" తండ్రి చెప్తుంటే శాంత వింటూ వుండిపోయింది.

"మర్యాదస్తులు లే తల్లీ... విశ్వనాథాన్ని కూడ చూచాను. మంచివాడే... భార్యవుందికదూ!"

తండ్రి ఆసందర్భ ప్రశ్నలో నిగూఢంగావుండి తొంగి చూచే అనుమానానికి నిశ్చేష్టురాలయింది. తేరుకుని "వున్నది నాన్నా. ఆమే చాలామంచిది" అన్నది శాంత.

కాళిదాసు ముఖంమీద ఆనంద రేఖలు పొడచూపినై.

"నాన్నా!..." శాంత ఏదో చెప్పబోయి ఆగిపో యింది.

విశ్వనాథంగారిని అడిగి ఒక నెలజీతం ముందే తీసు కుని తల్లికి యివ్వాలని ఆమె మనసులోని వుద్దేశ్యం. విశ్వ నాథంగారూ, ఆయన భార్యాకూడ చక్కగా స్నేహంగా మాట్లాడుతారు. ఆ డబ్బుతో మందులు యిప్పించవచ్చు

తండ్రికి అనుకున్నది శాంత. కాని పైకి తండ్రితో ఆ ప్రస్తావన తేవాలంటే ధైర్యం చాలలేదు ఆమెకు.

కూతురు చెప్పడానికి భయపడ్తున్నదని గ్రహించిన కాళిదాసు "ఏమిటమ్మా!... చెప్పు!" అన్నాడు.

శాంత మనసులోని మాట బయట పెట్టలేకపోయింది.

"చెప్పుతల్లీ..." ఆప్యాయత నిండిన స్వరంతో అన్నాడు కాళిదాసు.

"ఏమీ లేదునాన్నా... మీ కాలూ, చెయ్యీ ఎలాగున్నయ్. మెరుగుగా వుందా..." శాంత మాట మార్చి అన్నది.

"నాగురించి బెంగపెట్టుకోకు తల్లీ. చక్కగా చదువుకో. ఏదో వయసు వెనుకబడుతున్న కొద్దీ... కొత్తకొత్త రోగాలు వస్తయ్... వస్తయ్— పోతయ్..." కాళిదాసు కూతురుకి తన ఆరోగ్యం విషయమై బెంగగా వుందని గ్రహించి అనునయించాడు.

"నాన్న ఎప్పుడూ యిలాగే అంటాడు. తన శరీరమంటే అశ్రద్ధ... నా భవిష్యత్తు, నా చదువు అంటేనే శ్రద్ధ అవే ఆయన ధ్యేయమూనూ. శ్రద్ధగా మందులు యిప్పించాలి" అనుకొంటూ భారహృదయంతో తల్లిదగ్గరకు వెళ్ళింది శాంత.

వెళ్ళే శాంతను సజలనేత్రాలతో చూస్తూ, "నేనంటే ఎంత ప్రేమో తల్లికి... పిచ్చితల్లి కష్టపడ్తోంది" అనుకున్నాడు కాళిదాసు.

కన్నీరు కను కొలకుల్లోనుండి బయటపడి కణతల మీాదుగా జారి దిండును తడిపిస్తై.



శాంత చివరి పొయట్రీ పీరియడ్ వుండకుండానే బయటకు వచ్చేసింది. క్లాస్‌లో కూర్చున్నంతసేపూ ఆమె మనసు చికాకుగానే వుంది.

అస్థిరమైన మనస్సుతో, ముసురుకున్న ఆలోచనలతో కాలేజీ గేటుదాటి యింటిముఖం పట్టింది.

చెట్ల సందునుండి ముసిలిసూర్యుడు చప్పటిచూపులు విసురుతున్నాడు. ఆరోగ్యకరమైన గాలి వీస్తోంది. చల్లటి గాలికి శాంత వుదాసీనత కొట్టుకుపోయింది—

అప్పుడుగాని జ్ఞాపకం రాలేదామెకు ట్యూషన్ చెప్పేందుకు వెళ్ళడానికి మరోగంట వ్యవధి వున్నదని.

యీా గంటకోసం యింటికి వెళ్ళడమెందుకులే అని దగ్గరలోనే వున్న పార్కులోకి వెళ్ళింది శాంత.

పొగడచెట్టు చల్లటి నీడలోని సిమెంటు బెంచీమీాద కూర్చుంది ఆమె. సాయంత్రపు చల్లనిగాలికి పొగడపూల పరిమళం మత్తుగా వ్యాపిస్తోంది. ఆకాశంలో రెండు వెండి మేఘాలు పరిగెడుతున్నయ్. ఒకదానిని అంటుకోడానికి మరొకటి వెంబడిస్తున్నట్లు, చరచరా జరిగిపోతున్నయ్. దూరంగా లాన్‌లో పిల్లలు గంతులేస్తూ ఆడుకుంటున్నారు. సరివిచెట్టు తలమీాద కాకులగుంపు రొదచేస్తోంది.

శాంతమనసు నిలకడగావున్న ప్రవాహంలా ప్రశాంత

గంభీరంగా వుంది. ఆమె మనసులో వ్యాకులపాటు, చింత రెండూ లేవు.

పార్కుపక్కనే వున్న రోడ్డు జనంతో రద్దిగావుంది. బస్సులూ, టాక్సీలు రొదచేసుకుంటూ ఆయిల్‌కంపు గాలి లోకి వదులుతూ పరుగిడుతున్నాయి. పచారీషాపుల్లో కొందరు సరుకులు బేరం చేస్తున్నారు.

యింతలో ఒక నల్లటి మేఘం వ్యాపించింది. చల్లటి గాలికి చిన్న చిన్న వానతుంపరలు మొదలయినై. పార్కులో పిల్లలు జల్లులోనే తడుస్తూ కేరింతలు కొడ్తున్నారు... ఆకాశంలో మేఘాల అంచులు సూర్యుడి పైడికిరణాలతో బంగారు జరీలా మెరిసిపోతున్నయ్. ఒకవైపు చల్లటి ఎండ. మరో వైపు వానజల్లు.

హైద్రాబాదులో వాన ఏ సమయాన వస్తుందో చెప్పలేం... అప్పటి కప్పుడే ఆకాశం మేఘావృతమై దబ దబ కురిసి వెలిసిపోయి ఆకాశం స్వచ్ఛంగా, అద్దంలా, రోడ్లు కడిగిన ముత్యాల్లా తయారవుతై. పగలు ఎంత ఎండకాచినా సాయంకాలానికి చల్లటి గాలి సేద తీర్చుతుంది.

శాంత నిశ్చలత చెదిరింది. పొగడచెట్టు ఆకుల్లోనుండి చిన్న చిన్న చినుకులుమీద పడ్తున్నయ్. లేచి తడవకుండా క్లాక్‌టవర్ గోడవారగా నిలబడదామనుకొన్నది. కాని లేవ లేకపోయింది, అక్కడినుండి లేచి కాస్తదూరం కూడ నడిచే హుషారు లేదు ఆమెకు. జల్లు పెద్దది కాలేదు... కొద్ది క్షణాల్లోనే ఆకాశంలోని మేఘం కాస్తా విచ్చిపోయింది. వాతావరణం యథాతథంగా శుభ్రంగా మారిపోయింది.

గాలికి ఆకులమీది నీటిబిందువులతోబాటు పొగడ పూలు కూడ శాంతమీద రాలినై. రోడ్డుమీద మరల జన సంచారంకూడ మొదలయింది.

ప్రపంచంలోని యీ మనుషులంతా యీ నీటి బిందువులలాంటివారే. ఒక్కొక్క మనిషి ఒక్కొక్క బిందువు. యీ బిందువులు ఎలా తమ అస్తిత్వాన్ని నిలుపుకో ప్రయత్నిస్తున్నయో అలాగే మనిషికూడ తన సుఖ దుఃఖాలను ఎదుర్కొని తమ అస్తిత్వాన్ని నిలుపుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాడు.

మహాసాగరంలోని అనంత జలరాసి ముందు ఈ చిన్న బిందువు అస్తిత్వం ఎంత! కాని యిలాంటి బహు చిన్న బిందువులుకూడితేనే గదా ఆ మహాసముద్రపు అస్తిత్వమున్నా!!

నిర్వికారంగా కూర్చునివున్న శాంతచీరమీద రాలిన పొగడపూలని, నీటి తుంపరని చూస్తున్నదల్లా తన ముందు నుండి ఎవరో నడిచి వెళ్ళడంతో తన దృష్టి మరల్చింది... ఎవరో పాతికేళ్ళ ఆవారా. కౌబాయ్ ప్యాంట్ టీషర్టు వేసుకుని నల్లకళ్ళజోడు పెట్టుకుని ఆమె వైపే చూస్తూ వెళ్తున్నాడు. అప్పుడుగాని గుర్తుకు రాలేదు శాంతకు అతనే ఇంతకుముందు రెండుమూడుసార్లు తన ముందునుండే ఆసులో గొట్టంలా తిరిగాడని.

ఆమె నిస్తబ్ధత భంగపడింది. కల్లోలితురాలై ఇటూ అటూ చూసింది ఎవరన్నా తనను చూస్తున్నారేమోనని.

కొద్దిదూరంలోనేవున్న మరో బెంచీమీద జేబు

రుమాలు పరుచుకుని ఆవారా కూర్చుని శాంతనే చూస్తు న్నాడు.

శాంతకు ఈరోజు ఎందుకో అలా చూస్తున్న యువకు డిపై కోపంరాలేదు. యిదివరలో చాలసార్లు అలాంటి వాళ్ళంటే చీదరించుకున్నది ఆమె. అలా గుచ్చిగుచ్చి చూసే వాళ్ళని కాలి చెప్పుతీసి కొడ్తామన్నంత వుద్రేకమూ వచ్చేది.

ఇదివరకు కాలేజీలో ఒక స్టూడెంట్ అలాగే చూస్తుంటే నాలుగు చివాట్లు పెట్టింది. పక్కనే వస్తున్న స్నేహితురాళ్ళు కిలకిలా నవ్వారుకూడ. అందులో ఒకామె అన్నది "అతను నిన్నేమన్నా తిన్నాడటే... ఎందుకు అనవ సరంగా చివాట్లుపెడ్తావ్" అని.

"నీకు తెలియదులేవే... యీ మగపిల్లల వెకిలిచేష్టలు ఎక్కువయిపోయినై... ఎప్పటికప్పుడు బుద్ధిచెప్తేగాని బుద్ధి రాదు వీళ్ళకు. నీబోటివాళ్ళుండబట్టే వాళ్ళకీ అలుసుగావుంది" అన్నది కోపంతో శాంత.

అంతటితో ఆ స్నేహితురాలి నోరు కట్టుబడిపోయింది.

యింకా ఆ కుర్రాడు అక్కడే కూర్చుని, నల్లఅద్దా ల్లోంచి తనివితీరా చూస్తున్నాడు. వైట్ పాంట్ ఒంటికి అంటుకుపోయివుంది.

శరీరానికి అతుక్కుపోయి అసహ్యంగా కనిపించే కౌబాయ్ ప్యాంట్లు ఫాషన్ అయిపోయినై వీళ్ళకి. అమెరి కాలో గొడ్లుకాసేవాడు తొడుక్కునేదుస్తులు అవి. గొడ్లను కాసేటప్పుడు పరిగెత్తితే బంధాలుపడకుండా వుండటానికి వీలుగా వాళ్ళు కట్టించుకుంటే, పులిని చూచి నక్కవాతలు

పెట్టుకొంటున్నట్లు మన వారికి అది ఫ్యాషన్ అయి పూరుకుంది — అంతా యిమిటేషన్ సరుకు — ఛీ! !

అతనిపై చిరాకు రావడానికి మారుగా శాంత ఆలోచనలో మునిగిపోయింది. "ఎందుకు ఈ మగవాళ్ళు ఆడది కనిపిస్తే దొంగచూపులు చూస్తారు ! స్త్రీ వీళ్ళకి ఎందుకు యింత లోకువ అయిపోయింది. బజారున పోయే ఏ స్త్రీ నయినా, ఎంత చదువుకొని జ్ఞానమున్న వ్యక్తి అయినా వెనుదిరిగి చూడకుండా పోడు. ఈ జాడ్యం పామరుల్లోనూ, చదువుకున్న నాగరికుడిలోనూ ఒకే మోతాదులో వుంది."

తను పూరుకుంటే వాడు మరీ మితిమీరుతాడని, తనూ, భృకుటి మెలివేసి, చూడసాగింది అతనిని. శాంత కనిపెట్టిందని గ్రహించిన పిరికి హీరో మెల్లిగా లేచి ఎటో చూస్తున్నట్లు నటిస్తూ పిల్లిలా అడుగులువేస్తు జారుకున్నాడు.

ఈ ఒక సంఘటనతోనే శాంతకు స్త్రీ జాతి కర్తవ్యం బోధపడింది. స్త్రీ బేలలా పిరికిగా వున్నంతకాలం సమాజంలో స్త్రీ బానిస... పురుషుడి కాముక ప్రవృత్తికి ఆటవస్తువు. స్త్రీ ముందంజేవేసి, తనూ తక్కువేమీ కాదని తెలిపిననాడు కుళ్ళు తత్వాలన్నీ చెల్లాచెదురయి పోతాయి. అందుకు నిదర్శనం తను చూడనంతవరకూ వీరుడిలా చూసిన ఆవారా తను తల ఎత్తగానే దద్దమ్మలా పారిపోయాడు. తను స్త్రీ లోకానికి ప్రతినిధి అయితే. ఆవారా మలిన మనస్కుల సమాజానికిప్రతినిధి. తనలాంటి స్త్రీ లోకం తలెత్తి, ముందంజె వేస్తే దేశమే నివాళుల లర్పిస్తుంది. "పిచ్చిలోకం — పిచ్చివాడు" అనుకుని తనలో తానే నవ్వుకున్నది శాంత.

ఆలోచనలకు స్వస్తిచెప్పి టవర్ క్లాక్ వైపు చూచింది. రోజూ తను ట్యూషన్ చెప్పడానికి వెళ్ళే సమయం మించి పోయింది. తన పిచ్చి ఆలోచనలకు ఆశ్చర్యపడ్తూ లేచి త్వరగా పార్కునుండి బయటపడి విశ్వనాథం గారింటికి నడక సాగించింది.

♦ ♦ ♦

ఆలస్యమైనదని ఆతురతతో నడుస్తున్న శాంతకు వెనుకనుండి ఎవరో పిలుస్తున్నట్లు తోచింది. గొంతు స్త్రీది కాదు; స్నేహితులుపిలిచారేమోననుకుంటే. అయినాయిప్పుడు తననెవరు పిలుస్తారులే అని అనుకొంటూ మరో రెండడుగులు ముందుకు వేసింది.

మళ్ళా స్పష్టంగా పిలిచారెవరో "శాంతగారూ!" అంటూ.

యీసారి తననే పిలుస్తున్నారని నిశ్చయించుకున్న శాంత వెనుదిరిగి చూచింది. విశ్వనాథంగారు చక చక అడుగులు వేస్తూ దగ్గరపడుతున్నారు.

శాంత నమస్కారం చేసింది. గౌరవభావం తొణికిసలాడగా అనవతవదన అయింది.

ప్రతినమస్కారం చేస్తూ చిరునవ్వు నవ్వుతూ "బహుశా మీరు మాయింటికే వెళుతున్నారనుకుంటాను... అవునా" అన్నాడు విశ్వనాథం.

"అవునండీ... అక్కడికే వస్తున్నాను" శాంత నమ్రతతో అన్నది.

“మీకు నిన్న చెప్పడం మరచిపోయారు పిల్లలు. అంతా యివాళ సినిమాకు వెళ్ళారు. మీకు ముందుగానే చెప్పమని వాళ్ళ అమ్మకూడ చెప్పింది. మరచిపోయారు వాళ్ళు చెప్పడం. వృధాగా యింతదూరం శ్రమపడి వచ్చారు మీరు”అన్నాడు సానుభూతి కనబరుస్తూ.

“ఏదో పిల్లలు గదండీ...అయినా నాకు మాత్రం శ్రమ ఏమికలిగిందిలెండి మరేం ఫరవాలేదు”

కాసేపు వారిద్దరి నడుమ నిశ్శబ్దం రాజ్యం చేసింది. తక్షణ కర్తవ్యం ఏమిటా అని ఆలోచనలో పడ్డది శాంత. ఆయనేమో ఎదురుగా నిలబడ్డాడు. తను ఎలా బయట పడాలా అనే ఆలోచిస్తున్నది. ఆమె ఎలాగో లోలోపల కూడ పలుక్కుని ధైర్యంచేసి అన్నది “అయితే ఇవాళ నాకు సెలవన్నమాట. ఇంటికి వెళ్తాను. మీరు ఏదో పనిమీద వెల్తున్నట్లున్నారు. మీకు కష్టం కలిగించాను”

“యిక్కడే ఒకరిదగ్గర పనివుంటే వచ్చాను. కారు ఆఫీసులో వదిలేశాను. యిలా నడిచివస్తుంటే మీరు కనిపించారు. మిమ్మల్ని చూడగానే పిల్లలసంగతి గుర్తువచ్చింది.”

“యిలా సావధానంగా నడిచే అదృష్టం లేదు మాకు. ఎప్పుడూ హడావుడిగా యిటూ అటూ పరిగెత్తడమే. క్షణం తీరికలేని జీవితాలు. యివాళ పెద్ద పనేమీలేదు. యిలా సావకాశంగా నడిచేభాగ్యం కలిగింది” అన్నాడు విశ్వనాధం గొప్ప కష్టపడిపోతున్నట్లు, జీవితంలో క్షణం తీరిక దొరకక విల విల లాడిపోతున్నట్లు ముఖకవళికలు మార్చుకుని.

అలా అని శాంత ముఖంలోకి తదేకంగా చూసాడు క్షణకాలం.

శాంత ఆయన చెప్పినవిషయాన్ని సమర్థిస్తున్నట్లు, ఒప్పుకుంటున్నట్లు చిరునవ్వునవ్వింది. "మరి వెళ్ళొస్తానండి!" అన్నది.

"యింత త్వరగా యింటికి వెళ్ళి ఏంచేస్తారు. అనుకోకుండా తటస్థపడ్డారు. కాఫీతాగి వెళ్ళండి... రండి వెళ్దాం" అన్నాడు విశ్వనాథం.

శాంత సంకోచించింది. ఇదెక్కడి సమస్యరా భగవంతుడా అనుకొన్నది. ఒకవైపు పెద్దమనిషి ఆహ్వానిస్తున్నాడు. కాదనడం ఆయనను అవమానించడమే అవుతుంది. వెళ్తే... పరాయి మగవాడు... వెళ్ళడం గౌరవప్రదమైన వ్యవహారంకాదు.

ఆమె వెనుకాడుతున్నదని గ్రహించిన విశ్వనాథం "రావడానికిఅభ్యంతరమా! ఏదో ఆలోచిస్తున్నారల్లేవుంది!" అన్నాడు శాంత ముఖకవళికలు చూసి మనసును చదివినట్లు.

శాంత మనసు ఆ పని చేయనిరాకరిస్తున్నది. నెల రోజులకు పైగా విశ్వనాథం యింట్లో ప్రైవేటు చెప్తూతున్నది గాని ఆయనతో ఎన్నడూ ముఖా ముఖీగా మాట్లాడే అవకాశమే దొరకలేదు. యివాల్టి యీ పరిచయానికి కాఫీ హోటలులోనే నాందీ ప్రస్తావన జరుగుతోందా! ప్రతిరోజూ తను ప్రైవేటు చెప్పి యింటికి తిరుగుముఖం పట్టడం ఆయన ఆఫీసునుండి తిరిగిరావడం ఒకేవేళ, లోపలికి వెళ్తూ వెళ్తూ శాంతను క్షణకాలం చూసి ముందుకు పోయేవాడు.

ఆయన తనను అలా పరీక్షగా చూడడం శాంతకు యిష్టం వుండేదికాదు. కాని ఒకోసారి అనవసరంగా అనుమాన పడుతున్నానేమో అని పశ్చాత్తాప పడేది. ఏదో జవాబు చెప్పకతప్పదు, ఆ జవాబు అనుకూలంగానే వుండాలి ఆయన మాట తృణీకరించడం ఎందుకులే అనుకుని.

"అభ్యంతరమేమిటి లెండి. కాఫీ నాకు అలావాటు లేదుకూడ. కొత్తగాఅలవాటు చేసుకోడమెందుకులే అనే..." అంటూ చిరునవ్వు నవ్వ ప్రయత్నించి విఫలురాలయింది శాంత. సగం నవ్వుమాత్రమే నవ్వలేక నవ్వి నీరు కారిపోయింది.

"అయితే ఫరవాలేదు. ఒకసారి తాగినంతమాత్రాన అలవాటు కాదులెండి. రండి యిప్పుడే యింటికి వెళ్ళిపోదురుగాని" అన్నాడు దగ్గరలోనే రెస్టారెంట్‌కు దారితీస్తూ.

సంకోచిస్తూనే భారంగా విశ్వనాథాన్ని అనుసరించింది శాంత.

ఎందుకో ఆయనతో మాట్లాడాలన్నా, ఆయనతో వెళ్ళాలన్నా శాంతకు అమితమైన సంకోచంగా వుంది. కాలేజీలో లెక్చరర్స్‌తో, తోటి స్టూడెంట్స్‌తో మాట్లాడినప్పుడు కలిగిన అనుభూతికి భిన్నంగావున్నది విశ్వనాథంగారితో సంభాషణ. కాలేజీలో స్త్రీపురుష బేధభావం లేకుండా అవసరం వచ్చినప్పుడు తీవ్రంగా వాదించేది. కాని వారు స్నేహితులు, గురువులు. ఆ వాతావరణమే ఒకరకమైన ఆత్మీయతను, ఒకే కుటుంబములోని వారిమనే భావాన్ని కలుగజేస్తుంది. కాని యీ విషయం వేరు. కాని విశ్వనాథం

అలాంటి కోవకు చెందినవాడు కానేకాదు. వారిపిల్లలకు చదువు చెప్పడంతప్ప యింకేమీ సంబంధం ఆత్మీయత లేవు. విశ్వనాథం పరాయి మగాడు. అందుకనే ఆయనతో బెరుకుగా నడకసాగించింది శాంత.

ఆయన ఎటువెళ్తే అటు మంత్రముగ్ధలా వెళ్ళింది. రెస్టారెంట్ డోర్ వద్ద నిలబడి "రండి శాంతాదేవీ!" అన్నాడు విశ్వనాథం.

స్ప్రింగ్ డోర్ పక్కనేవున్న బోయ్ వంగి సలామ్ చేస్తూ దారి చూపించాడు. నవాబు రాజరికం మాసిపోయినా వారు వదలిన ముద్రలు చెరిగిపోలేదు...

బోయ్ స్ప్రింగ్ తలుపు తెరిస్తే విశ్వనాథం వెనుకనే శాంతలో పలికి వెళ్ళింది. ఎయిర్ కండిషన్డ్ హోటల్ అది. శరీరం అంతా చల్లటికృత్రిమమైన గాలితో పులకరించింది. వారగా కౌంటర్‌లో ఎలక్ట్రిక్ గ్రామ్‌ఫోను పాశ్చాత్య సంగీతం వల్లిస్తోంది... మెత్తటి తివాచీలమీద నడుస్తూ వెళ్ళి ఒకటేబుల్ ముందు కూర్చున్నారు యిద్దరూ ఎదురు బొదురుగా. గాడ్రెజ్ టేబుల్‌మీద రెండు గ్లాస్‌జార్‌లూ, యాష్‌ట్రే, మెనూ వున్నై.

కూర్చుని చుట్టూ ఒకసారి పరకాయించి చూచింది శాంత తనకు తెలిసిన వారెవరయినా వున్నారేమోనని. ఎవరూ పరిచితులు లేకపోవడం గ్రహించి తృప్తిపడ్డది.

"ఏంతీసుకుంటారు శాంతాదేవీ!" అన్నాడు విశ్వనాథం మెనూ చేతికి అందిస్తూ.

శాంత తికమకపడ్డది. విశ్వనాథం అంతటి మనిషి

తనను ఆహ్వానించడం, తనకు యింతగౌరవం ఆపాదించడం. ఆమెకు ఎటూ తోచలేదు.

"మీయిష్టం... మీరే చెప్పేయండి"

"మీరు సిగ్గుపడ్తున్నారు... మొహమాటం పనికిరాదనే సామెత మీకు తెలుసుగా..."

"కాఫీ చెప్పండి... అంతకన్న ఎక్కువ భరించగలిగే శక్తి లేదు."

"కాఫీకోసం యింతదూరం రావాలిటండీ... యింత ఆర్భాటపు హోటల్లోకి వచ్చి వుత్తకాఫీ తాగిపోతే సర్వరే నవ్వుకుంటాడు వెనుకనుండి"

శాంత మనసు ఆలోచనలో వుంటే, పెదిమలు నవ్వినై "మొహమాటం ఏమీ లేదండీ. యీ సమయాన కాఫీకన్న ఎక్కువ ఏంతీసుకుంటాం చెప్పండి?"

"మీరు చెప్పేటట్లు లేరు. నేను చెపుతా నుండండి" అని... మెనూ చూసి "బాయ్ రెండు వ్యానిల్లా ఐస్క్రీం పట్రా" అన్నాడు బోయ్‌తో.

కాసేపు వారిద్దరి నడుమ సంభాషణ ఏమీ జరుగలేదు. యింతలో బోయ్ ఐస్క్రీం పట్టుకొచ్చాడు.

"తీసుకోండి!" అన్నాడు విశ్వనాథం తను స్పూనుతో తీసుకుంటూ.

"మీ నాన్నగారి ఆరోగ్యం యిప్పుడెలాగుంది?" అన్నాడు ఏమీ మాట్లాడడానికి విషయం దొరకక.

తండ్రివిషయం గుర్తుచేయగానే శాంత విచార గ్రస్తురాలయింది. అన్నది "అలాగే వుందండీ... మానవ ప్రయ

త్నము అంటూ ఒకటి వుంటే తగ్గుతుందేమో కాని, గాలికి వొదిలిపెత్తే ఎలా తగ్గుతుంది?"

"ఎవరిదగ్గర మందు యిప్పిస్తున్నారు."

శాంతకు ఏమి చెప్పాలో ఎలా చెప్పాలో కూడ అర్థంకాలేదు. ఆయనేమో యింటి విషయాలన్నీ తనకేదో శ్రద్ధ వున్నట్లు, తనకు సంబంధం వున్నట్లు వివరాలు అడుగుతున్నాడు.

సరస్వతమ్మ అన్నగారు డబ్బు పంపిన కొత్తల్లో దయానిధికి చూపించారు. తర్వాత శాంత కాలేజీలో చేరడమూ, కాళిదాసును అశ్రద్ధ చేయడమూ జరిగింది. తిరిగి దయానిధి వైద్యం వదిలిపెట్టి ఆయుర్వేదంలోకి దిగింది. శాంత ట్యూషన్ డబ్బులు రాగానే కావాల్సిన మందులు కూడాకొని తెచ్చింది. పద్ధతిగా వైద్యం జరుగకపోతే జబ్బు ఎలా నెమ్మదిస్తుంది!

"ఆయుర్వేదపు మందులు ఇప్పిస్తున్నామండీ ముఖ్యమైన కారణం నాన్నగారు పడకపెట్టడంతో, సంసారం నా యీ ట్యూషన్ డబ్బులవల్లనే జరుగుతుంది. ఆయనకు సరయిన వైద్యం ఇప్పించడం కష్టమే"అన్నది శాంత చెప్ప కూడదని అనుకుంటూనే.

శాంత కంఠంలోని విషాదం గ్రహించిన విశ్వనాథం" "మీరేమీ అనుకోనంటే నే నొకటి చెప్తావింటారా?" అన్నాడు.

"చెప్పండి"

"ఈ విషయం మీ వ్యక్తిగతమైనది అయినా, అశ్రద్ధ చేయతగినది కాదు. కాబట్టి నేను కల్పించుకోడంలో కూడ తప్పులేదు. మరోలా భావించకపోతే దయానిధిగారి వైద్యం మళ్ళీ ప్రారంభం చేయిస్తాను. ఆయన నా ఫామిలీ డాక్టర్. ఆయన హస్తవాసికూడ మంచిది." అన్నాడు విశ్వనాథం శాంతవైపు సమ్మతించమనే అభ్యర్థనతో చూస్తూ.

"కాని..." అని ఏదో అనబోయి ఆపి ఆలోచనలో మునిగిపోయింది శాంత.

"అనవసరమైన సంకోచాలు ఏవీ వుంచుకోకండి. ఆయన మా ఫామిలీ డాక్టరని చెప్పాగా. ఫీజు అదీ నెల నెలా నాకు బిల్లు రాగానే కట్టేస్తాను."

విశ్వనాథం కాస్తఆగి తిరిగి అన్నాడు "మీకు తెలియ దేమో, మీనాన్నగారు నాకు స్నేహితులు. మీ నాన్న గారు నాకన్న చాల పెద్దవారయినా; నేనంటే వారికి సోదర వాత్సల్యం... కావాలంటే అడిగి చూడండి"

శాంత వెంటనే అవుననీ, కాదని ఎటూ చెప్పలేక పోయింది. విశ్వనాథానికి అనుకోకుండా యింత అవ్యాజాను కంపకలుగడానికి కారణం ఆమెకు బోధపడలేదు. ఆయనను పరీక్షగాచూచింది. ఆయన ముఖంలో ఎలాంటిభావన అయిన గోచరిస్తుందేమోనని. కాని ఏ దురూహ ఆయన ముఖకవళి కల్లో కనబడలేదు శాంతకు.

విశ్వనాథం సహృదయానికి పైకి కృతజ్ఞతలుకూడ తెలుపుకోలేదు శాంత. కాని ఆయనకు జవాబుగా కృతజ్ఞతా

భావం మాటలో తొణికిసలాడగా "సరేనండీ" అని మాత్రం అనగలిగింది.

యింతలో బోయ్ ప్లేట్‌లో బిల్ పట్టుకొచ్చాడు. విశ్వనాథం రెండురూపాయల నోటు పెట్టాడు అందులో. కాసేపటికి బోయ్ చిల్లర పట్టుకొచ్చాడు. కొంత చిల్లర ప్లేట్‌లోనే బోయ్‌కి "టిప్"గా వదిలి మిగతాది తీసుకుని పర్సులో వేసుకున్నాడు విశ్వనాథం.

♦ ♦ ♦

రెస్టారెంట్ బయటికి వచ్చారిద్దరూ. మునుపు యిద్దరిమధ్య వున్న అపరిచితులమనే భావన, బెరుకూ రెండూ యిప్పుడు లేవు. విశ్వనాథాన్ని మొట్టమొదట అనుమానించి నందుకు బాధపడ్డది శాంత.

దారిలో అడిగాడు విశ్వనాథం, "బి యే. అయిన తర్వాత ఏంచేద్దామని మీ వుద్దేశ్యం" అని.

"నాకు యీ బి. యే. కూడ పూర్తిచేయాలని లేదు. నాన్నగారి పరిస్థితేమో అలా అధ్వాన్నంగా వుందండీ. నా కేమీ తోచడంలేదు.

"నాన్నగారికి ఎప్పుడునయమవుతుందోకూడ చెప్పలేం. అప్పటివరకైనా మా పిల్లల ట్యూషన్ ఒక్కటీ ఏంసరి పోతుందీ!"

"అవునండీ. నిజమే"

"మరోరెండు ట్యూషన్లుకుదిరితే బాగుంటుందేమో"

"కాని..."

"మీ చదువుకూ వాటికీ కుదరదేమో — కదూ !"

"కాదండీ... కుదరకేం జేస్తుంది. అందుకుగాదు..."

"మరి మీ సందేహమేమిటి ?"

"నా కెవరూ పరిచయస్తులు లేరు. ఎవరూ తెలియకుండా ట్యూషన్లు దొరకడం కష్టమే ! చాలమంది వారివారి టీచర్లదగ్గరే ట్యూషను చెప్పించుకుంటున్నారు."

విశ్వనాథం మనసులో ఒక మెరుపులాంటి ఆలోచన వచ్చింది. తదేకంగా శాంతను చూసి... "ఒక విషయం చెబుతా మీ కిష్టమేనా ?" అన్నాడు.

శాంత జవాబు యివ్వకమునుపే "మీరుకూడ స్కూల్లో టీచరుగా చేరండి. అటు నెలసరి జీతమూవస్తుంది. కావలసినన్ని ప్రైవేట్లుకూడ దొరుకుతై. యిహ చదువంటారా, వుద్యోగంచేస్తూ చదువుకోవచ్చు"అని అన్నాడు... శాంత ఏమంటుందోనని జవాబుకై ఎదురుచూస్తూ.

శాంత వెంటనే ఏమీ జవాబు చెప్పలేకపోయింది. అదనంగా రెండు ప్రైవేట్లు సంపాదించలేకపోయిన తను అంత తేలికగా ఉద్యోగం ఎలా సంపాదించగలుగుతుంది.

"చదువు పాడవుతుందని బాధగా వుందా శాంతా దేవి ?" అన్నాడు విశ్వనాథం

"అది కాదండీ..."

"మరేమిటో చెప్పండి!"

మనసులోని గంభీరతను కనబడనీయకుండా నవ్వుతూ. "వున్నపళాన నాకు ఉద్యోగం ఎవరిస్తారండీ..."అని అన్నది శాంత.

క్షణం సేపు ఆలోచించి విశ్వనాథం "అంతా నాకు వదిలేయండి ... సరోజినీదేవి మెమోరియల్ హైస్కూల్ సెక్రెటరీ నా స్నేహితుడే. ఆయనతో మాట్లాడి అన్ని ఏర్పాట్లు చేస్తాను."

శాంత సంతోషానికి మేరలేకపోయింది. కాని ఆ ఆనం దాన్ని పైకి ప్రకటించలేదామె.

యం. ఏ. చదివి ప్రైమరీ స్కూలు టీచరుగా చేరిన వారిని ఎరుగును ఆమె. బి. యే. సగంలోవున్న తనకు ఎవరు యింత త్వరగా వుద్యోగ మిస్తారనుకొన్నది శాంత. విశ్వనాథంగారి హామీతో ఆమె మనసు కొంత కుదుట పడ్డది.

"మరి మీ చదువుఫీజుకట్టి మానేస్తారా..." అన్నాడు విశ్వనాథం.

"నా చదువు యిప్పుడు ముఖ్య సమస్య కాదండీ. నాన్నగారి ఆరోగ్యం, పిల్లల చదువులు, భుక్తి యివి ముందు చూడాల్సినవి... తర్వాతే నా చదువు"

విశ్వనాథం ముఖంపై సంతోష రేఖలు అలుము కున్నై... "అయితే రేపే సెక్రటరీని కనుక్కుంటాను... అనవసరంగా మీ సమయాన్ని వృధాచేసాను... యిక్కడ వుండిపొండి... బస్సు యిక్కడ ఆగుతుంది"

విశ్వనాథం ముందుకు సాగిపోయాడు.



ఇంటికిచేరిన శాంత మనస్సు అస్థిరంగా, వ్యాకులంగా వున్నది.

శాంత జీవితం ఇప్పటివరకు; ప్రశాంత ప్రవాహంలా, ఏ ఒడుదుడుకులు లేకుండా గడిచింది. తండ్రి కులాసాగా వున్నట్లయితే తను నిర్విఘ్నంగా చదువు సాగించి వుండేది. తల్లిపోరువల్ల ఒకవేళ వివాహం జరిగినా, తండ్రి వారిని ఒప్పించి తనను చదివించేవాడే. కాని యిప్పుడు తండ్రి ఒక వైపు మంచంలో వున్నా చదువుతున్నదంటే మన స్ఫూర్తిగా కాదు. తండ్రి కోరిక ప్రకారమే... కాదంటే ఆయన బాధ పడ్తాడనే. అటు వివాహముకాక, చదువూ ఆపితే, అమ్మలక్కల పోరుకు అదుపుకూడా వుండదు. ఇంకా పెళ్ళి చెయ్యలేదూ అని బుగ్గలు నొక్కుకుంటారు.

యివాళ శాంతకు, నిశ్చలంగా, సూటిగా ప్రవహించే తన జీవితగతి మారబోతున్నదని చూచాయగా గ్రహింపుకు వచ్చింది.

అమ్మ నాన్నలకు చెప్పకుండా ఆరోజు ట్యూషను కుదుర్చుకొని ప్రారంభించినప్పుడుకూడ ఆమె అలాగే అనుకున్నది. ఆనాటి మనస్థితి యిప్పటిలాగే వున్నది.

నిద్రబోయేముందు; తన డైరీలో యిలా రాసుకున్నది శాంత.

"పరిస్థితులు ఎక్కడికి లాక్కొనివెళ్తాయో అర్థంగాకుండా వున్నది. కాని ఏదో మార్పుతప్పదని తోస్తున్నది. జరుగబోయే పరిణామాన్ని నిండు హృదయంతో ఆహ్వానించక ఏంచేయను! ఎప్పుడూ ఒకేరకంగా గడిచిపోయే జీవితంలో ఏమితృప్తి వుంటుంది? వైవిధ్యంలేని జీవితం అనుభ

వించే శిక్షకన్న మరో శిక్ష లేదు. వైవిధ్యంలోనే ఆనందం, తృప్తి; రెండూనూ.

విశ్వనాథంగారితో ముఖాముఖి పరిచయం కాక తాలీయం. ధనవంతులకు హృదయముండదని, వారు రాక్షసులని అనుకునేదాన్ని పూర్వం. అలాంటి విపరీతమైన భావన నాలో ఎందుకు ఏర్పడిందో స్పష్టంగా నాకే తెలియదు. కాని నా అభిప్రాయం తప్పుఅని యివాళ తెలుసుకున్నాను.

విశ్వనాథంగారికి ధనవంతుడుననే గర్వం లేదు... ఆయన ప్రయత్నం ఫలిస్తే కొద్ది రోజుల్లోనే వుద్యోగం రావచ్చు. దయానిధిగారి వైద్యంకూడా ఆయన బాధ్యతపై తిరిగి ప్రారంభిస్తానన్నాడాయన. ఎంత మంచివాడు గాకపోతే అలా బాధ్యత పైన వేసుకుంటాడు? డాక్టర్ ఫీజు తనే యిస్తాననికూడ అన్నాడు... కాని అంతకన్న నైచ్యం మరోటి వుండదు. ఆయన సహృదయుడుకావచ్చు. కాని ఒకరిబిక్షపై ఆధారపడి తండ్రికి వైద్యం చేయించదు తను. ఉద్యోగం కుదిరి, జీతం రాగానే ఆయన డబ్బు ఆయనకు యిచ్చేస్తాను.

అకస్మాత్తుగా ఎందుకు నామీద యింత శ్రద్ధ చూపుతున్నాడో!... అగమ్యగోచరంగా వుంది. మొట్టమొదట హోటల్‌కు వెళ్ళినప్పుడే మనస్సులో శంకకలుగకపోలేదు... కాని ఆయన ప్రవర్తన సభ్యతకు భిన్నంగా ఏమీ లేదు.

ఒకసారిమాత్రం... తలవంచుకుని ఐస్‌క్రీం తింటూ ఎందుకో తలఎత్తి చూసేటప్పటికి ఆయన నావైపే చూస్తున్నాడు... కాని అలా చూడడం! అనుకోకుండా జరిగి

వుంటుంది. ఆయన కన్నెత్తి చూసినప్పుడే, నేనూ చూసానేమో....

చదువు మానేస్తున్నాననీ, ఉపాధ్యాయినిగా వృత్తిలో జేరుతున్నాననీ నాన్నగారితో ఎలా చెప్పాలో - ధైర్యం చాలడంలేదు.

ఆయనకేమో నా చదువంటే శ్రద్ధ. కాని పరిస్థితులు యిలా వున్నప్పుడు అన్నీ యథా విధిగా సాగాలంటే ఎలా కుదురుతుంది, అమ్మని ఒప్పించడం ఏమంత కష్టంగాదు. ముందు నాన్నగారి సమ్మతి తెలుసుకుంటే తర్వాత ఏ యిబ్బందీ వుండదు.

ముందే అన్ని ఏర్పాట్లు చేసుకుని తర్వాత ఆయన చదువుకోవాల్సిందే అన్నాడంటే అటు విశ్వనాథంగారికి మాట రావచ్చు.

యిలా తనకు వుద్యోగం యిప్పించడం వలన విశ్వనాథంగారు నానుండి ప్రతిఫలం కాంక్షిస్తారేమో! ఈ వ్యవహారంవల్ల లేని పరిచయం, వృద్ధి అవుతుంది.

స్వచ్ఛమైన, నిష్కల్మషమైన స్త్రీ పురుష స్నేహాన్ని వింతగా చూసి, ఎన్నో అర్థాలు పెడర్థాలు సృష్టిస్తుంది సమాజం.

యిద్దరు పురుషుల మైత్రిలా, యిద్దరు స్త్రీలస్నేహంలా స్త్రీ పురుష సాంగత్యం ఎందుకు నిర్మలంగా వుండలేదు?... అందుకే విశ్వనాథంగారితో హోటల్లో వున్నంతసేపు తేళ్ళు జెర్రులూ పాకినట్లుంది. వెకిలి సమాజానికి ప్రతినిధులయిన ఎవరు చూసినా లేనిపోనివి వాగుతారు.

స్నేహితురాళ్ళు చూసినా ఏదో గ్రహించినట్లు, అంతా తమకు అర్థమైనట్లు వికపునవ్వు నవ్వుతారేగాని, యిన్ని చదువులు చదివి, ఆధునిక భావాలు సంతరించుకున్నా ఎదుటివాడిని వేలెత్తి చూపడం మాత్రం మానరు.

నాన్నగారి ఆరోగ్యం కుదుటపడాలి. అది మన చేతుల్లో లేదు... నెలలు పట్టవచ్చు సంవత్సరాలు పట్టవచ్చు... అన్ని పరిస్థితులు ఒకదరి జేరేవరకూ నేనిలాగే వుంటాను... వివాహప్రసక్తి తేవద్దని అమ్మతో చెప్తాను. కుటుంబ సంతోషంకోసం ఆజన్మాంతం అవివాహితగానే వుంటాను. నా స్వార్థందృష్ట్యా, నా ఒకతె ఆనందంకోసం, తండ్రిని, తల్లిని, వృద్ధిలోకి రాబోతున్న తమ్ముడ్ని చెల్లెళ్ళని, వీళ్ళం దర్ని నట్టేట్లో వదిలేసి వివాహం చేసుకోను. వుద్యోగంలో చేరితే అమ్మ పెళ్ళిచేయమని నాన్నని ఒకటే పోరుతుంది. యిప్పటివరకూ చదువుఒకటి అడ్డుపెట్టి ఆపుతూవచ్చారు నాన్న. యిప్పుడు నాన్నకూడ అమ్మపక్షమే వుంటాడు. కాని ఎలాగో వారికి నచ్చచెప్పుతాను... వివాహంమాత్రం చేసుకోను. తన వివాహంవల్ల నాన్నను అప్పుల్లో ముంచ డమే అవుతుంది"

డైరీలో రాసినదంతా చదువుకుని "చాలా రాశానే" అనుకున్నది ?

వివాహం గురించి తన మనసు ఎందుకు ఇంత కలవర పడాల్సి వచ్చింది? తన అంతరాంతరాళాల్లో వివాహం చేసు కోవాలనే కోర్కె బలీయంగా లేదుగదా! అని అనుకొన్నది డైరీ మూస్తూ శాంత.

మర్నాడు ట్యూషన్‌కు విశ్వనాథం యింటికి వెళ్ళి నప్పుడు సెక్రెటరీతో మాట్లాడినట్లు, దరఖాస్తు రాసి పంప మన్నట్లు చెప్పాడు ఆయన. వెంటనే అక్కడే ఒక దరఖాస్తు రాసి యిచ్చింది.

మూడోరోజున ఆమెకు వుపాధ్యాయినిగా నియుక్తి చేసినట్లు అధికారపత్ర మొచ్చింది. దానిని విశ్వనాథం నుండి అందుకున్న శాంత ఆనందానికి మేరలేకపోయింది. జీతం నూటయాభై అనీ, వెంటనే నౌకరీలో ప్రవేసించాల్సిందనీ అందులో వున్నది... ఆమె కలలన్నీ ఘనీభవించి ఆ కాగితం రూపంలో వచ్చి నిజమైనాయా అనుకున్నది శాంత.

ఆమె ఆరోజు అనుకున్నట్లుగా వుద్యోగం విషయం తల్లితోగాని, తండ్రితోగాని చర్చించనేలేదు. ఎందుకో ధైర్యం చేయలేకపోయింది. అందుకని ఆ నియుక్తి పత్రాన్ని భద్రంగా దాచింది.

శాంతకు ఆశ్చర్యంగానే వుంది ఉద్యోగం యింత సులభంగా తనను వెతుక్కుంటూ వస్తుందని ఆమె కలలో కూడ అనుకోలేదు... దరఖాస్తు కాగితం యిచ్చిన మూడో నాటికి ఆర్డరు రానేవచ్చింది. ఉద్యోగాలుకోసం సంవత్సరాల తరబడి నిరాశతో తిరిగిన వాళ్ళని, తిరుగుతున్న వాళ్ళని ఆమె ఎరుగును. ఆమె అదృష్టమే యింతత్వరగా దొరకడం.

దీనికంతటికీ కారణం విశ్వనాథం. ఆ విషయం జ్ఞప్తికి రాగానే ఆయనయెడల కృతజ్ఞతతో ఆమె అనవశిరసత్క అయింది. విశ్వనాథం ఆర్డరు తెచ్చి యిస్తుంటే తలవంచు కుందేగాని నోటితో ఏమీ వెల్లడించలేకపోయింది. విశ్వ

నాథం తను అన్నమాట నిలబెట్టుకున్నాడు. ఆయన స్నేహితుడే శక్రటరీ అయినప్పుడు వెంటనే రాకేంజేస్తుంది. రాజు తల్చుకుంటే దెబ్బలకు కొదవా!

"ట్యూషనువలన వచ్చే యాభై, జీతం నూటయాభై మొత్తం రెండువందలౌ స్తే జీవితం ఒక గాడిలో పడుతుంది. నాన్నకీ త్వరలోనే కులాసాచిక్కుతుంది" అనుకున్నది శాంత.

యింతలో చిన్న చెల్లెలు దుర్గ అటుగావచ్చింది. శాంత సంతోషాతిరేకంతో పట్టుకుని ముద్దుపెట్టుకుని, నలిపి, కుదిలించివేసింది.

ఆ పిల్ల అక్క కారణంలేని సంతోషానికి ఆశ్చర్యపడ్డది.

యిదివరకెన్నడూ అక్కయ్యను యింతసంతోషంగా యిలా కుదిలించివేయగా చూడలేదామె.

ఎత్తుకుని నలిపివేసిన చెల్లెల్ని దింపి భుజాలు పట్టుకుని "ఎక్కడనుంచి వస్తున్నావే పిల్లా!" అన్నది శాంత.

అక్కగారి విచిత్ర ప్రవర్తనకు స్తంభించిపోయిన దుర్గ మాట్లాడలేకపోయింది.

"యీ పిల్ల మూగపిల్లకూడాను మాటలుకూడ రావు" అన్నది చిలిపిగా చూస్తూ శాంత.

యిప్పుడూ దుర్గ, అక్క హాస్యానికి బదులు పలుక లేదు.

"యీం మూగపిల్లని ఎవరూ పెళ్ళిచేసుకోరు." ఎలాగైనా మాట్లాడించాలని శాంత చెల్లెల్ని రెచ్చగొట్టింది.

"నేనేం పెళ్ళిచేసుకోను. నువ్వే చేసుకో" అన్నది చివరికి ఎలాగైతేనేం దుర్గ, అని తిరిగి అక్క సంతోషానికి కారణం ఆలోచించడంలో మునిగిపోయింది.

అంతటితో ఆ ప్రస్తావన ముగించి, శాంత చెల్లెల్ని అలా పట్టుకునే "నీకేం కావాలో చెప్పు" అన్నది వరాలిచ్చే దేముడిలా.

దుర్గకిది రెండో ఆశ్చర్యకరమైన విషయం... ఒకటి ఎన్నడూ లేనిది అక్కయ్య తనతో పరాచకాలాడడం— కోరుకున్నది యిస్తానని హామీచెప్పడం రెండోది.

ఏం కోరాలా అని లోపలే తర్జనభర్జనలు జరుపుకుని చివరికి.

"డెకరాన్ లంగా, టెరిలిన్ జాకెట్టూ కావాల క్కాయ్" అన్నది అక్కయ్య హామీపై భరోసాతో.

"కొనిపెడతాలే... చదువుకో చక్కగా" అని చెల్లెల్ని వదిలేసింది. ఆ పిల్ల ఆనందాతిరేకంతో వెళ్ళిపోయింది.

తృప్తిగా శాంత తండ్రి గదిలోకి దారితీసింది. తండ్రిని పరీక్షగా చూసింది యిదివరకటికన్న మార్పు ఏమన్నా కనిపిస్తున్నదేమోనని కాని మునుపటికంటె మార్పు కొంచెంకూడ కనిపించ లేదామెకు. ఆరోజు విశ్వనాథంగారు చెప్పినట్లు మర్నాటినుండి డాక్టరు దయానిధి వచ్చి చూచి పోతూనేవున్నాడు. ఏవేవో ఇంజ క్షన్లు అవీ యిస్తూనే వున్నారు. కాళిదాసుకు చేసిన చికిత్సకు ఆయన ఫీజు యివ్వరనీ, మందులకు, అన్నింటికీ విశ్వనాథం గారే నెల నెలా వారి బిల్లులో యిస్తారనీ తెలుసు దయానిధికి

అంత శ్రద్ధగా చూడడం లేదాయన. ఆసంగతి కాళిదాసుకూ తెలుసు. శాంతకుకూడ తెలుసును.

"లోకాన్ని ఉద్ధరిద్దామనా డాక్టర్లు అయింది జనాన్ని పిండి డబ్బు చేసుకుందామని గాని" అనుకొనేది శాంత.

మొట్టమొదట వారంరోజులూ శ్రద్ధగా చూసినా తర్వాత దయానిధి అశ్రద్ధ ఎక్కువయింది. వచ్చి చూసినా మందు హాస్పిటల్‌కు వచ్చి తెచ్చుకోమనేవారు. తర్వాత పిల్లలు ఎవరో వెళ్ళితే యిచ్చేవాడు.

దయానిధిని మాన్పించి మంచివైద్యం మరోచోట చేయించాలని నిర్ణయించుకున్నది శాంత.

"నెల పూర్తికాగానే రెండువందలు చేతికి వస్తయ్. వందరూపాయలలో అమ్మ ఒబ్బిడిగానే వెళ్ళదీయగలుగుతుంది. మిగతా వందలో నాన్నకు మందులు, పళ్ళు ఫలాలూ యిప్పిస్తుంటే త్వరలోనే నిమ్మళిస్తుంది" అనుకుంటూ ఏదో నిశ్చయించుకుని తండ్రి మంచంపక్కనే స్టూలుమీద కూర్చున్నది శాంత.

కూతురి రాకతో భర్తచేతికి తైలం మర్దనచేస్తున్న సరస్వతమ్మ వెనుదిరిగి చూసింది. కాళిదాసుకూడ కూతురు రాక గమనించాడు.

శాంత తల్లి చేతిలోని సీసా తీసుకుని "ఏమన్నా పని వుంటే చూసుకో అమ్మా. నాన్నచేతికి నేను రాస్తాను" అన్నది.

తల్లి సంతోషంతో, ఆశ్చర్యంతో కూతురు మొహం లోకి చూసింది. అనిర్వచనీయమైన తృప్తి ఆమె నేత్రాల్లో

మెరవగా లోపలికి వెళ్ళిపోయింది ఆమె. వెళ్తుండగా ఆమెకు కూతురు వివాహవిషయం మనసులోకి రాకుండా వుండలేక పోయింది. ఆ తలపుతో విషాదచ్ఛాయలు కమ్ముకున్నై ఆమె వదనంలో.

కూతురు చెయ్యి రుద్దుతుంటే, కాళిదాసు కళ్ళలో కూతురుమీద ప్రేమంతా నిండుకువచ్చింది.

తండ్రిమీద భక్తితో, జాలితో శాంత సేవచేస్తుంటే, కూతురిమీద వాత్సల్యంతో కాళిదాసు మెరిసే నేత్రాలతో చూస్తున్నాడు. యిద్దరిమధ్య కొంతసేపు మాటలు లేకుండానే గడిచింది.

తర్వాత కాళిదాసే నిశ్శబ్దాన్ని విరిచేసాడు.

"బాగా చదువుతున్నావుగా తల్లీ!" అంటూ.

"యం. ఏ. ప్రైవేటుగానే యిస్తానునాన్నా" అన్నది సమయం దొరికిందని ధైర్యం కూడదెచ్చుకుని.

కాళిదాసు వులిక్కిపడ్డాడు. తను సరిగ్గా విన్నాడా, లేదా అని అనుమానంకూడ కలిగింది మొదట ఆయనకి.

"ఏమిటమ్మా నువ్వనేది ... ప్రైవేటుగా వెళ్ళడ మేమిటీ!" అన్నాడు కాళిదాసు ఆందోళన వ్యక్తపరుస్తూ.

"ఉద్యోగం వచ్చింది నాన్నా. . అందుకని..." తడ బడుతూనే అన్నది యీసారి. తండ్రి ముఖంలో కలిగే మార్పులను గమనించి నీరు కారిపోతూ.

కాళిదాసు చకితుడై ... "ఉద్యోగమా - ఏమిా ఉద్యోగం..." అన్నాడు. పడుకున్నవాడు లేవప్రయత్నిస్తూ.

ఆ ప్రశ్న వేసి కూతురి వంక నిర్నిమేషంగా చూస్తూ వుండిపోయాడు ఆమె మనసులోని ఆలోచనలు చదివేస్తు న్నాడా అన్నట్టు.

"ఆడపిల్లల హైస్కూలులో టీచరుగా వుద్యోగ మొచ్చింది నాన్నా. రేపే ప్రవేశించాలి. నూటయాభై యిస్తారట. రేపు వెల్తాను" అన్నది దిగజారి పోబోయే ధైర్యాన్ని సమీకరించుకుంటూ.

కాళిదాసు అవాక్కై కూతురి ముఖంలో ఆమె భవి ష్యత్తు చదువుతున్నవాడిలా ఆమెను తదేకంగా చూస్తూ వుండిపోయాడు.

అతని ఆశలకు ఆశయాలకు, విరుద్ధమైన సంఘటన అది. అతని కోర్కెకు గొడ్డలిపెట్టయిన కూతురి హఠాన్ని ర్ణయం అతని వాక్ప్రతిభకు దెబ్బకొట్టింది. మూగవాడిలా కూతురి మొహంలోనుండి తీక్షణంగా ఏదో లోకాల్లోకి చూస్తూ వుండిపోయాడు.

"విశ్వనాథంగారే యిప్పించారు. ఆయన మిత్రులట హైస్కూలు సెక్రటరీ అందుకని యిబ్బంది లేకుండానే యిప్పించారు." అన్నది తండ్రి మౌనాన్ని ఆసరాగా తీసుకుని.

కూతుర్ని పరీక్షగా చూస్తూ, ఆమె మనసును చదువు దామనుకున్న కాళిదాసు విఫలుడైనాడు. ఎప్పటిలాగానే కూతురి వదనం నిర్మలంగా వుంది.

ఆమె ముఖంలో గోప్యంగానీ, మరేవిధమైన కలుషిత భావనగానీ కనిపించలేదాయనకు. పైగా తన యెడల ఆమెకు

గల విశిష్టమైన గౌరవభావం, అనురాగం, భక్తి ప్రపత్తులు ప్రస్ఫుటించినై కూతుర్ని అనిమిషంగా చూసిన కాళిదాసుకు.

కూతురి నిర్ణయం విన్న కాళిదాసుకు నరాలన్నీ ఒక్కసారి మరీ బలహీనమైనట్లు బాధ కలిగింది. తమాయించుకుని! "మరి నీ చదువు ఎలాగమ్మా. నీకు చదువు ఎంత ముఖ్యమని నేను అనుకున్నానో అంత పమ్ము చేసావ్ నా ఆశని" అన్నాడు కాళిదాసు వివశుడై.

తండ్రీ కూతుళ్ళ సంభాషణ విన్న సుస్వాతమ్మ సంతోష విచారాల ద్వైదీభావంలో చిక్కుకు పోయింది. ఆర్థిక పరిస్థితి, కుటుంబ దుస్థితి దృష్ట్యా కూతురు ఒక విధంగా మంచి పనే చేసింది.

స్త్రీకి రక్షణలేని యీ సమాజపు పోకడలు ఆమెకు స్వతహాగా అనుభవించినవి కాకపోయినా, విని ఆకళించుకొన్నది. స్త్రీ విలువలు ఏమిటో తనవుద్దేశ్యాన్ని యిత మిద్ధమని చెప్పకుండా "తొందర పడ్డావేమో నమ్మాయ్" అన్నది ఆమె.

శాంత నిర్ణయాన్ని తల్లిదండ్రుల్లో ఒక్కరూ తెగనాడలేదు. పర్యవసానం వేరుగా భావించి భయపడిన శాంతకు యిప్పుడు పూర్తిగా ధైర్యం చిక్కింది.

"యిప్పుడు ఆడవాళ్ళు ప్రైవేటుగా చదువ వచ్చు నాన్నా. టీచరుగాచేస్తూనే చదివి పాసవగలను. ఆ బెంగేమీ మీరు వుంచుకోకండి" అన్నది శాంత.

కాళిదాసు హృదయంలో రగిలే బాధ ఆయనను

యింకా సంభాషణను పెంచనీయలేదు. "నీ యిష్టం తల్లీ... యింకేం చెప్పను" అన్నారు క్లుప్తంగా.



ఆ రాత్రి శాంతకు సరిగ్గా నిద్రపట్టలేదు. భవిష్యదాలోచనలతో కలత చెందిన మనసుతో రాత్రంతా మేలుకునేవుంది శాంత.

మర్నాడు ఆర్డర్ కాగితాన్ని తీసుకుని పది గంటల కల్లా స్కూలుకి వెళ్ళింది. పాఠశాల వాతావరణం ఆమె వూహించినవిధంగా గాక అందుకు భిన్నంగా వుంది.

హెడ్ మిస్ట్రెస్ పేరు మేరీ ఆనందం. నలభై సంవత్సరాల వయసుంటుంది. లేని అందంకోసం అవస్థపడి, మొహం నిండా తెల్లగాపౌడరు రూపాయిబిళ్ళ మందాన అద్దుకున్నది. ఆమె తెచ్చిపెట్టుకున్న ఆడంబరం చూచిన శాంత "పిల్లలకు యీమే ఫ్యాషన్లు నేర్పదుకదా" అనుకున్నది లోపల.

ప్రధానాధ్యాపకురాలు, సౌందర్య ప్రాధాన్యత లేకపోయినా నిండుగా పెద్దముత్తయిదువలా మాతృత్వం తొణికిస లాడుతూవుంటుంది అనుకున్న శాంత ఆశపై చన్నీరు కుమ్మరించినట్లయింది.

జీవితంలో తటస్థపడే సుఖదుఃఖాలను ధైర్యంగా ఎదుర్కొంటూ, మాతృమూర్తి తన అనురాగసుధను కుటుంబంలో అందరికీ ఎలా పంచుతుంతో అలాగే ప్రధాన అధ్యాపకురాలు కూడా వుండాలని ఆమె భావన. పాఠశాల కుటుంబం, ఆమె మాతృమూర్తి.

కాని ఆమెను చూడగానే ఒక చెడ్డ అభిప్రాయం కలిగింది శాంతకు.

కొందరిని చూసిన మరుక్షణంలోనే, మన హృదయంలో కొంతభాగం వారికి కేటాయించి, ఆత్మీయత పెంచుకోబుద్ధివేస్తుంది. మరికొందరు ప్రథమ వీక్షణంలోనే ఆజన్మ విరోధులుగా కనబడతారు. ఒక్కొక్కరి మొహం తీరు అది.

శాంత పరిస్థితి అలాగేవున్నది. ఎంతో వుత్సాహంతో వచ్చిన శాంత హెడ్‌మిస్ట్రెస్ మొహం చూడగానే జావకారి పోయింది.

తమాయించుకుని తనకు తానే సర్ది చెప్పుకున్నది. స్కూలు వాతావరణ మెలావున్నా తను నమ్మిన ఆశయాం తను చెప్పే తరగతిలోనైనా ఆచరణలో పెడ్తాననుకొన్నది శాంత.

హెడ్‌మిస్ట్రెస్ ఏవో కాగితాల్లో మునిగివుంటే అలాగే ఆలోచిస్తూ, ఆమెనేచూస్తూ నిలబడిపోయింది శాంత హెడ్‌మిస్ట్రెస్ టేబిలుముందు.

తనకు వచ్చిన ఆర్డరుతీసి ఆమెముందు వుంచి, టేబుల్ ముందున్న కుర్చీలో కూర్చుండిపోయింది శాంత. ఆర్డరు తీసుకుని చూడకుండా అక్కడే వెయిట్‌కింద పెట్టి మళ్ళీ తన కాగితాల్లో తలదూర్చింది ఆమె.

కొంతసేపు నిశ్శబ్దం నిండిపోయింది ఆ గదిలో. శాంత దిక్కులుచూస్తూ గడిపింది ఆ కాసేపు.

తర్వాత హెడ్‌మిస్ట్రెస్ ఆర్డరు కాగితం చదివి, భృకుటి మెలికవేసి అయిష్టత సూచిస్తూ "హుం... నువ్వే నన్నమాట శాంతమ్మ అంటే" అన్నది వుసూరుమంటూ వుబ్బసం రోగిలా.

"కాదండి. వొఠిశాంతేనండి; అమ్మని కాదండి" అన్నది శాంత హెడ్‌మిస్ట్రెస్ ఏకవచనసంబోధనకు అసహ్యపడుతూ. హెడ్‌మిస్ట్రెస్ కంఠం మగరాయుడి గొంతులా వుంది.

"ఒహో! ఉత్తిశాంతేనన్నమాట." మేరీ ఆనందం మొహం చిట్లించుకున్నది.

"యివాళే జేర్తారా?..."

"యివాళ జేరాలనే వచ్చానండీ...

హెడ్ మిస్ట్రెస్ తీక్షణంగా చూసింది. తనదగ్గరకు వచ్చిన కొత్త టీచరును - ఆమె కళ్ళల్లో నేను యీ సంస్థ కంతటికీ పెద్ద తలకాయను సుమా! అనే గర్వం ప్రతి ఫలిస్తోంది.

కుర్చీలో యిటూ అటూ కదిలి ఠీవిగా కూర్చున్న దామె. తర్వాత టేబుల్ మీదవున్న బెల్ నొక్కింది. ప్యూన్ వచ్చింది.

"యీ విడకు ధర్డ్‌ఫారం బి చూపించు." అని శాంత వైపు తిరిగి.

"యివాళ మీరు థర్డ్‌ఫారం చెప్పండి. రేపటినుండి టైంటేబుల్ ప్రకారం చెప్పుదురుగాని. ఇంగ్లీషు లిటరేచరా బి. యే. లో మీరు తీసుకుంది. బి. యే. కూడా పూర్తి చేయులేదుగా" అన్నది రూం పైకప్పుకేసి చూస్తూ.

"అవునండి"

"అవుతే యింగ్లీషు పీరియడ్లులేవే... సరేచూద్దాం పిప్రుఫారం యింగ్లీషు చెప్పగలుగుతారా."

"చెప్పుతానండి. ప్రయత్నిస్తాను"

"ప్రయత్నించడమనేదే లేదు. నేను సెక్రెటరీగారికి హిస్టరీ టీచరు కావాలని చెప్పాగాని; బి. యే. లిట్టులు కావాలని చెప్పలా. ఆయనేమో మిమ్మల్ని పంపాడు." అని శాంతవైపు నిర్లక్షంగా చూసింది.

శాంత జవాబు చెప్పకుండా కూర్చుండి పోయింది.

"మీారు ట్రెయిన్డుకూడ కాదుగా"

"కాదండి"

"బాగానేవుంది... ట్రెయిన్డు టీచర్లు కావలసినంత మంది వస్తారు. ఈ సెక్రెటరీగార్కి మీారే కనిపించారూ!... ఏమీా తెలియని వాళ్ళంతావచ్చి మా నెత్తినెక్కుతారు... మరోవైపు రిజల్టులు సరిగా రావడంలేదని గోల. టీచర్లను మంచివాళ్ళను పంపుతే రిజల్ట్సు బాగా ఎందుకు రావు!"

శాంతకు ఒకవైపు కోపమూవచ్చింది ఆమె అసభ్య సంభాషణకు. తనను సున్నితంగానే అవమానిస్తున్నందుకు భాధ పడింది. కాని ఏం చేస్తుంది. అవసరంకొద్దీ వుద్యోగం కోసం వచ్చినందుకు ఎన్ని మాటలయినా పడాల్సి వస్తుంది అని తమాయించుకున్నది శాంత.

  

ఆ రోజు శాంత ఫర్డుఫారం క్లాసుకు వెళ్ళింది.

మధ్యాహ్నం లంచ్ అవర్‌లో టీచర్లంతా టీచర్స్ రూంలోకి వెళ్ళారు. వారిలో కొంతమంది బుద్ధిమంతులు లాగానే కూర్చున్నారు. కాని చాలమంది బిగ్గరగా కేకలు వేస్తూ. నవ్వుతూ, గోలచేస్తున్నారు. గొర్రెలమందను ఒక గదిలోకి తోలినట్లున్నది అక్కడి వాతావరణం.

శాంతకూడ గదిలోకి వచ్చి మూలగావున్న ఒక ఖాళీ కుర్చీలో కూర్చున్నది.

శాంత కూర్చున్న మరుక్షణంలో అయిదారు గొంతులు కిల కిలమన్నై.

ఒక గొంతుక... "యివాళ మన మహద్భాగ్యం— ఒక కొత్తమొహం మన స్కూల్లో చేరింది... తాజాసరుకు- చూడవోయ్ హనుమాయమ్మా" అన్నది మధ్య మధ్య నవ్వుతూనే.

"ఆహా... చూసాగా... జన్మ తరించింది. యిహ యీమెదేగావాలు రాజ్యం... రాణిగారు..." సదరు హనుమాయమ్మ జవాబు.

"ఒకప్పుడు నువ్వూ నేనూ కూడా రాణులమేగా" మరోశాల్తీ.

శాంతకు వారి సంభాషణకు, ప్రవర్తనకు అసహ్యం వేసింది. "వింటూ మెదలకుండా వూరుకున్న దేతప్ప ఏమీ అనలేదామె.

"మరో ఆవిడ అర్థంగాక హనుమాయమ్మ నుద్దేసిస్తూ హనుమాయమ్మా— ఏమిటీ సంగతి..."

"నువ్వు చూడనేలేదన్నమాట... బాగానేవుంది. మరో మహారాణి పట్టంకట్టుకొన్నదివాళ యీ సామ్రాజ్యంలో. సక్కుబాయికి దృష్టిలోపంకూడ వచ్చిందే" హనుమాయమ్మ ఛలోక్తి విసిరింది.

అర్థంచేసుకున్న సక్కుబాయి పగలబడి నవ్వింది రూం దద్దరిల్లేటట్లు.

"ఏమిటే..."

"ఏమిటండీ"

"అరే అంతగా నవ్వేస్తున్నావ్" కొంతమంది యీ విషయమేమీ పట్టనివాళ్ళు ప్రశ్నలవర్షం కురిపించారు.

"సెక్రటరీగార్కి మరో రబ్బరుబొమ్మ ఆడుకోడానికి వచ్చింది" కొంచెం గొంతు తగ్గించి అన్నారెవరో.

మరల గది దద్దరిల్లింది.

ఎవరో, ఒక్కసారి వారినందరినీ చీదరించుకుని "అసహ్యంగా ఏమిటండీ యీ గోల. ఎవరన్నా ఏమన్నా అనుకుంటారనికూడ లేకుండా... సభ్యత నేర్చుకోండి" అని అన్నారు.

పీకనొక్కేసినట్లు అందరూఒక్కసారిగా ఆగిపోయారు. నిశ్శబ్దం అలుముకుంది గదిలో క్షణంసేపు.

బాగా అలవాటైన గొంతుక వూరుకోలేక మళ్ళీ మొదలు పెట్టింది.

వ్యంగంగా "తమరేమీ మాకు కాండక్టు సర్టిఫికెట్ యివ్వనవసరం లేదండి" అన్నది ఆమె గింజుకుని... ఆమె హనుమాయమ్మ.

"తప్పుగా భావిస్తా రెందుకు. నేనేం తప్పు మాట మాట్లాడలేదండీ. మీతోపాటు పనిచేయడానికి మీ లాంటి ఒక సోదరి కొత్తగా వచ్చినప్పుడు యిలా నోటికి వచ్చినట్లు మాట్లాడితే ఏమనుకుంటారు చెప్పండి"

ఎవరో కిసుక్కుమని నవ్వారు "యీ నిర్మలాదేవి మనకి నీతి బోధచేస్తున్నదర్రోయ్ - మహాగొప్పగా. ఈమె అలనాడు సీత సావిత్రిల కోవలలోదిలెండి. మహాపతివ్రత. వారికంటె గొప్పదనుకుంటుందీమె" అన్నారు. మరొకరు నిర్మల తమకు ప్రతికక్షిగా వుండడం, ఎదురు తమకే నీతి బోధ చేయడం యిష్టం లేక. అనుకోకుండా సద్దుమణిగింది.

తర్వాత కొందరు ప్యూనుచేత టిఫెన్లు, కాఫీలు ఎవరికి కావాల్సినవి వారు తెప్పించుకున్నారు.

మరికొందరు యింటిదగ్గరనుండి తెచ్చుకున్న టిఫిన్లు పుచ్చుకోసాగారు.

ఆసమయంలో కూడా చిన్నపిల్లల చేష్టలే. పెద్దగా కేకలు పెట్టడం, నవ్వడం, ఒకరి ఎంగిలి ఫలహారాలు మరొకరు తీసుకుని తినడం, నానాఅల్లరి చేస్తున్నారు. పెద్దవారై వుద్యోగాల్లో ప్రవేసించినా వారికి బుద్ధిపరిణతికి రాలేదు. అసలు వారిచేష్టలు మారుతవని, వారిబుద్ధికి ఒక పరిణతి వస్తుందని కూడా సూచనలేదు వారి ధోరణి పరిశీలిస్తే.

శాంత యింతజరిగినా; పరిశీలిస్తూ నిర్వికారంగా కూచునేవుంది ఆకుర్చీలోనే. ముళ్ళమీద కూర్చున్నట్లు ఆ వాతావరణం పైనే జుగుప్స కలిగిందామెకు.

యింతలో నిర్మల ఆమెదగ్గరకువచ్చింది. వారి అల్లరిని తెగనాడి కేకలేసింది ఆమె.

"మీా పేరు శాంతాదేవి కదూ!" అన్నదామె స్నేహ భరిత స్వరంతో.

"అవునండీ" అన్నది చిరునవ్వు పెదాలపై తెచ్చుకుని. యింత సేపటికైనా తనకో స్నేహితురాలు దొరికిందనే సంతోషంతో.

"వాళ్ళంతేలెండి. మీారు బాధపడకండి. వెకిలి మనుష్యులు" అన్నది నిర్మల మళ్ళీ.

నిర్మలంటే మంచి అభిప్రాయమే ఏర్పడ్డది శాంతకు. "యీామె ముఖం చూస్తేనే ఎవరికైనా స్నేహం చేయాలని పిస్తుంది." అనుకున్నది శాంత.

తర్వాత నిర్మల మరో కుర్చీని ఆమెకు దగ్గరగా లాక్కొని తను తెచ్చుకున్న ఫలహారాన్ని టిఫిన్ మూతలో పెట్టి "యిది తీసుకోండి. మనిద్దరం తలా కాస్త తిందాం" అన్నది.

"ఛ ! అదేమిటండీ... నాకు ఆకలిగాలేదు. మీారు తీసుకోండి. నాకు వద్దు" ఒకవైపు ఆమె ఆదరణకు ఆశ్చర్య పడుతూ మర్యాదగా నిరాకరించింది శాంత.

"యీా తోటి ఫలహారానికి ఆకలి గావాలిటండి. ఫరవాలేదుయివాళనుండీ మనం స్నేహితులం. మీా సోదరి యిస్తే పుచ్చుకోరన్నమాట"

నిర్మల మర్యాదకరమైన ప్రవర్తనకు లొంగిపోయింది శాంత. తర్వాత ఆమె ఫలహారం తీసుకోక తప్పిందికాదు.

మెల్లిగా తలవంచుకుని తింటున్న శాంతను చూసి "పెళ్ళికూతురిలా సిగ్గుపడతారెందుకు ? లాగించేయండి. తిండిలో బిడియమూ, మొహమాటమూ వుండకూడదు" అన్నది నిర్మల.

నిర్మల మైత్రిలో, ఆమె ఆదరణలో శాంత అంతకు ముందు జరిగిన గొడవఅంతా మరచిపోయింది.

వుండి వుండీ, మొదట అంత బిగ్గరగా అరవకపోయినా మెల్లి మెల్లిగా నవ్వుకుంటూ, గుస గుసలాడుకుంటున్నారు ఆ బృందం.

కాని యిప్పుడు శాంతకు అంత యిబ్బందిగా లేదు.

పిల్లలను భావిపౌరులుగా తీర్చిదిద్దే వీరే యిలా జుగుప్సాకరంగా ప్రవర్తిస్తే వారు నేర్పేది, పిల్లలు నేర్చుకునేది వెకిలితనమూ, అల్లరీ తప్ప వేరే ఏమీ వుండదు—

వారినిచూస్తే జాలీ, కోపమూ, అసహ్యమూ కలిగినై శాంతకు.

"తన మనసులోని మాటే పైకి సాధ్యమైనంత తగ్గు స్వరంలో నిర్మలతో అన్నది శాంత.

యింతలో ఆ మందలో మళ్ళీ గొడవ బయలు దేరింది.

"నాకూ ఏ సెక్రటరీయో ప్రియుడైతే బాగానే వుండు" వెంబడే పాడు నవ్వు...

"సరిగ్గా నేనూ అదేఅనుకుంటున్నానోయ్. నా నోట్లో మాట లాగేసుకున్నావ్ ..."

"నేనే సెక్రెటరీని మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. ఏం గావాలో కోరుకోండి నా హృదయ రాణుల్లారా!"

మళ్ళీ గలగల నవ్వు...

శాంత అంతా వింటూ చూస్తూ కూర్చున్నది. కాసేపు మళ్ళీ నిశ్శబ్దం.

యింకా కొత్త ఛలోక్తులకోసం ఆలోచించుకుంటు న్నారల్లే వుంది.

యింతలో గంట మోగింది. అందరూ వీరిని చూస్తూ నవ్వుతూ ఒక్కరొక్కరే కదిలారు.

నిర్మల, శాంత కూడ రూం బయటకు వచ్చారు. దారిలో నిర్మల "మీరెక్కడ వుంటున్నారు శాంతాదేవీ!" అన్నది.

"వైదిక్ నగర్‌లో."

"అయితే ఫరవాలేదు. నేను రహత్ మహల్ నుండి రావాలి. బస్సులబాధ లేదుమీకు"

"నిజమే. అదొక లాభం" .

"యింతటితో వాళ్ళు ఆపేస్తారనుకోకండి. యింకా ఏమేమో వాగుతారు. మీరుమాత్రం లక్ష్యపెట్టకండి... సరేనా"

"అలాగేలెండి. ఏమైనా వాగనివ్వండి"

"అదీ. అలాగుండాలి." అని చక చకా తన క్లాసు లోకి వెళ్ళిపోయింది నిర్మల నవ్వుతూ.

శాంతకూడా తృప్తిగా నిర్మల మంచితనాన్నే తలుచు కుంటూ తను చెప్పవలసిన క్లాసుకు వెళ్ళింది—

స్కూలు కాగానే నిర్మలతో కలిసి వచ్చేసింది. నిర్మలను స్టేషన్‌లో వన్‌స్టాప్‌లో దించి యింటికివచ్చింది శాంత.

తర్వాత యథావిధిగా ట్యూషనుకూడ చెప్పింది.

ఆరోజు ఎందుకో ఎన్నడూ లేని సంతోషంతో వుక్కిరిబిక్కిరై పోయింది శాంత.

కాళిదాసు, సరస్వతమ్మ కూతుర్ని కొత్తగాచూస్తారు.

అప్పటివరకు కూతురు (బాధ్యతలులేని) చదువుకునే పిల్ల. కాని యీరోజు సంసారభారాన్ని తన భుజస్కంధాలపై మోయ సన్నధురాలయిన బాధ్యతలు తెలిసిన వుద్యోగస్తురాలు.

తండ్రి ఆరోగ్యంకోసం, కుటుంబ సంరక్షణకోసం ఆమె చదువుకు స్వస్థిచెప్పి ధైర్యంగా ముందంజవేసిన త్యాగమయి.

♦ ♦ ♦

ఆరోజు రాత్రి భోజనాలయినతర్వాత శాంత తను ఉద్యోగంలో ప్రవేసించిన మొదటిరోజు గురించి డైరీలో యిలా వ్రాసుకున్నది.

నా జీవితంలో నూతన శకమారంభమయిన రోజు యిది. నా జీవన మహాప్రయాణంలో మరో మజలీ పూర్తిచేసి, కొత్త శక్తితో, వుత్సాహంతో, నవచైతన్యంతో గమ్యంకోసం మరో మలుపు తిరిగా నీరోజు.

నా గమ్యం చేరేలోపల, నా ఆశయాలు, ఆశలు పరిపూర్ణంగా నెరవేరే లోపల ఎన్నో కష్టాలు ఎదుర్కో-

వాల్సి వస్తుందని తెలుసు. అయినా మనో స్థయిర్యంతో ఎన్ని యిబ్బందులనయినా ఎదుర్కొని ముందుకు పోతాను.

వూహాలకు, వాస్తవికతకు వూహించలేనంత అంతరం వుంటుంది.

స్కూలు విషయంలో మొదట నేను వూహించిన దానికీ, తర్వాత యివాళ కళ్ళారా చూసిన దానికీ ఎక్కడా సామ్యమే లేదు.

అయినా అది ఏమంత భయపడవలసిన విషయం కాదు. మంచి చెడ్డలనేవి ఎక్కడలేవు ? సమర్థించుకురాగల ననే ధైర్యం వున్నది నాకు.

అంత మంది పిల్లలలో నేను కూర్చుంటే హృదయం వుప్పొంగిపోయింది...పిల్లల ఆనందానికీ హద్దులేదు. పాత టీచర్లకు, తనకు గల తేడా మొదటి రోజే గుర్తించారు పిలలు.

నిష్కల్మషమైన వారి వదనాలు చూస్తుంటే వారితో నేనూ ఆడుకోవాలని, అందరినీ, ప్రేమతో అక్కున జేర్చు కోవాలనీ విచిత్రమైన భావన వుదయించింది.

ఏదో అనిర్వచనీయమైన ప్రేరణతో కొన్ని క్షణాలు వారందరి ముఖాల్లోకి, ఆనందం విప్పారిల్లిన నేత్రాలతో చూస్తూ వుండిపోయాను.

వారంతా నా బిడ్డలయినట్లు; నేను వారి సుందర భవిష్యత్తును కాంక్షించే మాతృమూర్తి నయినట్లు అనిర్వాచ నీయమైన అనుభూతిని పొందాను.

నేను తల్లిని— వారంతా నా బిడ్డలు... పువ్వుల్లాంటి బిడ్డల్ని కొట్టడానికి చేయి ఎలా వస్తుందో తెలియదు. పిల్లలు అల్లరి చేస్తారు. పిల్లలుకాబట్టి అల్లరిచేస్తారు. అందుకోనే పెద్దలకు, పిన్నలకు గల అంతరం అయినంతమాత్రాన కసాయివాని నట్లు ఎలా కొట్టగలుగుతారో.

ఒక పసిపిల్లను బెత్తంతో బాది ఎండలో నిలబెడ్తున్నది ఒక మహోత్సురాలు మధ్యాహ్నం. ఆమె హృదయం రాతికన్న మొద్దయి వుంటుంది. అసలు హృదయమే లేదేమోకూడా.

కొందరు తమ జీవితాలకోసం మొక్క తీర్చుకోడం తప్ప, అసలు ఏమీ చెప్పనేచెప్పరట.

నేనూ జీతంకోసం, నా కుటుంబ నిర్వాహణకోసమే ప్రవేశించాను. కాని నేనూ వారివలె కర్తవ్యవిముఖురాలవుతాననేది కలలో విషయం.

నన్ను చూసి సహోపాధ్యాయులు ఎందుకంత అసహ్యంగా ప్రవర్తించారో బోధపడడంలేదు. వారిప్రవర్తనలో ఈర్ష్య ప్రస్ఫుటిస్తోంది. సవితుల్ని దెప్పి పొడిచినట్లు సూటిపోటి మాటలు, పాడునవ్వు. ఒక్కొక్కరి చెంపమీద లాగి ఒకటి పుచ్చుకుందామన్నంత కోపమొచ్చింది.

వారి వేళాకోళాన్నిబట్టి చూస్తే సెక్రటరీప్రబుద్ధుడుగా కనిపిస్తున్నాడు. మరి అలాంటివాడికీ, విశ్వనాథంగారికీ స్నేహితమెలా కలిసిందో తెలియదు. ఆయనకీ యీయనకీ సామ్యమెక్కడని.

విశ్వనాథంగారు కూడ మంచివాడు కాదా!

ఎందుకో వారింటిదగ్గర ట్యూషనుకు వెళ్ళినప్పుడు ఆయన చూసిన చూపు నాకు కోపం తెప్పించింది. పూర్వపు ప్రవర్తనకు, యివాళ్టిప్రవర్తనకు తేడా చాలానేవుంది. విశ్వనాథం, సెక్రెటరీలాంటివాడేనా. అసలు సెక్రటరీ సంగతేమిటో వివరంగా తెలుసుకోవాలి.

యిహ హెడ్‌మిస్ట్రెస్ సరేసరి—బోగంది నయం—

నాకు నచ్చిందినిర్మల. నాకంటె కొద్దిగా వయస్సులో పెద్దదయివుంటుంది. మంచి తెలివితేటలుగలది. గంభీర మనస్తత్వం. ఆమెను చూస్తుంటే నాకు గొప్ప అండదొరికినట్లు, హృదయం విప్పి 'అక్కా!' అని పిలవాలని అనుభూతి కలుగుతోంది.

డైరీ పూర్తిచేసి రకరకాల ఆలోచనలతో నిద్రపోయింది శాంత—



శాంత దినచర్య విశ్రాంతిలేకుండా గడచిపోతున్నది. పగలల్లా స్కూలులోవుంటే సాయంత్రం ట్యూషనుతో సరిపోయేది. యింటిపనులు, తండ్రి శుశ్రూష... వెసులుబాటు లేకుండా వుంది శాంతకు. తను యింటిదగ్గర వున్నప్పుడు తండ్రికి మందు యివ్వడం మొదలయినవి ఆమే శ్రద్ధగా చూచేది...

ఆదివారం. ఆరోజు సరస్వతమ్మ భర్తదగ్గరకూర్చుని చెయ్యి రుద్దుతున్నది.

శాంత వంటయింట్లో కూరలు తరుగుతున్నది. ఆమె

చెల్లెలు దుర్గ గిన్నెలు తోమినవి యింట్లో పెడ్తోంది. విజయ చదువుకుంటున్నది.

కూరలు తరగడం ఆపి కత్తిపీట మడిచి పక్కనపెట్టి మధ్యగదిలోని తల్లి దగ్గరకువచ్చి "నెయ్యి నిండుకున్నదమ్మా, నాన్నకుకూడా నూనెవేసి చేసేదా కూర" అన్నది తగ్గు స్వరంతో...

కాళిదాసు, భార్య జవాబు చెప్పకముందే అన్నాడు "ఎన్నాళ్ళు నన్ను రోగిష్టివాడినిగా చూస్తారే... నా ఆరోగ్యం యిదివరకటికన్న ఎంతో మెరుగు. యింకానన్ను పథ్యంలో వుంచారు ఎందుకు. మీతోపాటే తింటాను. ప్రత్యేకంగా ఏమీ అవసరంలేదు" అని.

యీ మధ్య కాళిదాసు తన చేతిని కాస్త పైకి ఎత్త గలుగుతున్నాడు. అంటే ఆయనకు శుశ్రూష సరిగానే జరుగుతున్నదని చెప్పాలి...

కొద్దిగా మార్పు కనిపించిందని ఆహారం వగైరాలలో అశ్రద్ధచేస్తే మళ్ళీ తిరగబెడ్తుంది.

అందుకని సరస్వతమ్మ భర్త పూర్తిగా కోలుకునే వరకు అన్నీ సవ్యంగానే చేయాలని, నిశ్చయించుకున్నది. తాము తీసుకునేశ్రద్ధలో ఎలాంటిలోపం జరుగకూడదని శాంత వుద్దేశ్యంకూడ.

శాంత తండ్రి మాటలను విననట్లు తల్లివైపు తిరిగి ఆమె జవాబుకోసం చూసింది.

సరస్వతమ్మ ఏదో చెప్పబోతున్నదల్లా వాకిట్లో కారు ఆగడంతో అటు తిరిగి చూసింది.

కారుడోర్ తెరుచుకుని ఒకాయన గుమ్మం దగ్గర కొచ్చి "కాళిదాసు గారూ" అని పిలిచాడు.

సరస్వతిమ్మకు ఆయనెవరో తెలియదు. శాంత గుర్తు పట్టగలిగింది. ఆయన విశ్వనాథం.

"కాళిదాసు కూతురితో ఎవరో పిలుస్తున్నారు. అటు చూడమ్మా" అన్నాడు.

సరస్వతమ్మ లోపలికిపోగా శాంత ఆయన్ని "రండి లోపలికి నాన్నగారు యిక్కడ వున్నారు" అన్నది.

విశ్వనాథం లోపలికివచ్చి కాళిదాసు మంచంపక్కనే వున్న స్టూలుమీద కూర్చుని కాళిదాసుకు నమస్కారంచేసి "యిప్పుడు మీ ఆరోగ్యం ఎలా వుందండీ!" అన్నాడు.

"ఏదో యిలా వుంది నాయనా యిప్పుడిప్పుడే తగ్గుముఖం పట్టుతున్నది. మీ సహాయం మరువలేను బాబూ. అమ్మాయ్ చెప్పింది అన్నీ. మీమంచి తనమే మీకు సహాయం చేస్తుంది. భగవంతుడు మీకు మేలు చేస్తాడు."

శాంత ఆశ్చర్యపడుతున్నది విశ్వనాథం అకస్మాత్తుగా ఎందుకు వచ్చాడా అని. ఆయన మాటవరుసకయినా అననే లేదు మీ యింటికి వస్తానని.

"అయ్యో... అలా అనకండి. అయినా నేనేం గొప్ప సహాయం చేసాను గనుకా... ఎప్పటినుండో వచ్చి చూసి పోదామని అనుకోడం... కాని క్షణంతీరిక, దమ్మిడీ ఆదాయం లేదన్నట్టు... నిముషం తీరిక లేకుండా వుంది. యివాళ ఇటు సీతాఫల్-మండీలో పని వుంటే పోతూ గుర్తువచ్చి పలకరించి పోదామని వచ్చాను!" అన్నాడు విశ్వనాథం.

"అమ్మా శాంతా... కాఫీ యివ్వమ్మా విశ్వనాథం గారికి..."

"కాఫీవద్దండి. నాకు అలవాటుకూడ లేదు...ఎప్పుడో గాని తాగను. యిప్పుడే వస్తూ వస్తూ పుచ్చుకుని వస్తున్నాను" అన్నాడు విశ్వనాథంగారు ఆ మాట అని శాంత వైపు చూచాడు చిరునవ్వు నవ్వుతూ.

ఆయన చూసిన చూపు శాంతకు నచ్చలేదు. వెంటనే తన చూపు మరోవైపుకు తిప్పుకున్నది.

విశ్వనాథం కాళిదాసును వుద్దేశించి "సెక్రెటరీగారిని యిప్పుడే కలిసివస్తున్నాను. మీ అమ్మాయిని ఒకటే మెచ్చుకున్నారు, మీ అమ్మాయి రాకతో హైస్కూలు వాతావరణమే మారిపోయిందిట! వచ్చిపదిరోజులు కాలేదు; పిల్లలు క్షణం వదలి వుండలేరుట మీ అమ్మాయిని"

కాళిదాసు నేత్రాలు గర్వంతో మిలమిలలాడినై... కూతురి ప్రశంస విని.

కాని శాంతకు ఆయన పొగడ్త ముఖస్తుతిగా తోచింది ఎందుకో...విశ్వనాథం అంటే అనిర్వచనీయమైన వ్యతిరేక భావనకూడ ఆమె మనసులో పొడసూపింది. ఆయన వెగటు ప్రవర్తనకు లోలోపలే అసహ్యించుకుంటూ లోపలకి వెళ్ళిపోయింది శాంత.

"తర్వాత వస్తానండీ!" అని విశ్వనాథం, కాళిదాసు వారిస్తున్నా వినకుండా వెళ్ళిపోయాడు. పనివున్నదంటూ.

◆ ◆ ◆ ◆

"విశ్వనాధంగారి రాకలో వుద్దేశ్యం ఏమిటి? కనీసం వస్తానని కూడ ముందు మాటమాత్రం అనలేదు. శనివారం సాయంత్రం ట్యూషన్ చెప్పడానికి వెళ్ళినప్పుడు యింట్లోనే వున్నాడు. ఆయన. అంతస్థు ఎక్కడ మా అంతస్థు ఎక్కడ! నాన్నతోకూడ అట్టే పరిచయంలేదు. ముఖపరిచయం తప్ప.

మరి విశ్వనాథం అవ్యాజాను కంపకు కారణం!...

నాన్నను చూడడానికే ప్రత్యేకంగా వచ్చినట్లు ఎన్నాళ్ళనుండో చూద్దామని వున్నట్లు చెప్పారు. కాని ఆయన కథనంలో సత్యం ఏకోశానా గోచరించడంలేదు.

నాన్న కాఫీ తెమ్మన్నప్పుడు, తను కాఫీ తాగనని సమర్థించుకుంటూ నన్ను చూస్తూ వెకిలి నవ్వు నవ్వినప్పుడు వొళ్ళు భగ్గున మండింది.

నన్ను చూడడం, నవ్వడం నాన్న చూడకపోబట్టి సరిపోయిందిగాని చూస్తే ఆయన ఏమనుకొనేవారో?

మరోసమయంలో అయితే తగినట్లు జవాబు చెప్పే దాన్నే... యిన్నాళ్ళు విశ్వనాథం మర్యాదస్తుడు అను కున్నాను.

మర్యాదలకు, వ్యక్తిత్వానికి, గౌరవానికి భంగం కలుగనంతవరకు ఎవరి స్నేహాన్నయినా కోర్తానుగాని, యిలాంటి అసభ్యప్రవర్తనలు హర్షించను.

ఆయన సంభాషణ కూడ సహజధోరణిలో లేనేలేదు. ఏదో తెచ్చిపెట్టుకుని వాగినట్లున్నది.

ఆయన సహాయాన్ని పొందడంవలన చులకన అయిపో యినట్లే వుంది యీ చేష్టలసారాంశం.

నా మనసులో ఆయనయెడల ఏర్పడిన గౌరవం యివాళ్టితో సమూలంగా భగ్నమైపోయింది...

యిప్పటివరకూ గంభీరంగా వుండి, పెద్దమనిషిలా నటించిన మనిషి యింత త్వరగా ఎందుకు బయటపడ్డాడు!...

యివాళ ఆయన యిక్కడకు రాకపోయినా గౌరవం దక్కించుకొనేవాడు. ఆయన యిక్కడకు రాకపోవాల్సింది. వచ్చి గౌరవాన్ని, మర్యాదను మంటగలుపుకున్నాడు.

వయసేమీ తక్కువకాదు. నాకన్న పదిపన్నెండు సంవత్సరాలు పెద్ద, ముగ్గురు పిల్లలతండ్రి, చక్కటి భార్య. లక్షల ఆస్తి... జీవితం వడ్డించిన విస్తరి.

అలాంటి మనిషికి బుద్ధి పెడదారి పట్టింది...

విశ్వనాథం పయోముఖవిషకుంభం— జాగ్రత్తగా వుండాలి...

అమ్మానాన్నలకు, నాపెళ్ళే ప్రధానసమస్యగా వున్నది. నాన్న తనస్నేహితులు కొందరికి వుత్తరాలు రాశారుట, వున్నపళాన సంబంధాలెక్కడ దొరుకుతయ్. నేను వారి గుండెలమీద కుంపటిలా తయారైయాను.

విదేశాలలో వివాహవ్యవస్థే వేరని, స్త్రీలుకూడ యిష్టమొచ్చినప్పుడు వివాహం చేసుకుంటారని, అవసరమొస్తే వారు జీవితాంతం ఆ వివాహితలుగానే వుంటారని ఎలా నచ్చచెప్పను వీరికి.

మనదేశంలో ఒక పెళ్ళీడుకొచ్చిన పిల్ల వివాహ విషయం ఆమె తల్లితండ్రులకన్న ఎక్కువగా అమ్మలక్కలే పట్టించుకుంటారు. యితరుల వ్యవహారాలన్ని వారిస్వంతమే.

పెళ్ళి ఎందుకు చేయడంలేదనే విషయం మొదలు ప్రతివిష యమూ రంధ్రాన్వేషణ చేసి లేనిపోని కారణాలు అంటగట్టి గాలిదుమారాలు సృష్టించడమే వారిపని తెల్లవారి నిద్ర లేచింది మొదలు. పాడు మనుషులు! పాడుసమాజం!

నా యీపాతిక సంవత్సరాల వయస్సే వీరికి ఎక్కువై పోయింది. అమ్మను అందరూ రోజూ "కూతురి పెళ్ళి ఎప్పుడు చేస్తా"వని అడిగి వేధిస్తూ వుండి వుండాలి. నేను వుద్యోగంలో చేరడం కూడ అత్యాశ్చర్యకరమైన విషయం వాటికి.

నేను యీ పరిస్థితులన్నిటినీ అధిగమించి, వివాహం చేసుకోగల్గుతానని ధీమాగా చెప్పలేను.

అవివాహితగా వుండి కూడ ఎన్నో విషమపరి స్థితులు ఎదుర్కోవాల్సి వస్తుంది. అప్పుడే వాటి సూచనలు కూడ ప్రారంభమైనై.

నాకు వివాహం ఆలశ్యంగా చేసుకోవాలని, అసలు చేసుకోనేటటువంటి ఆదర్శాలేవీ లేవు. పరిస్థితుల ప్రభావ మొక్కటే నన్ను అవివాహితగా చేస్తున్నది. నాన్నకు తగ్గ కుండా, సంసార పరిస్థితి బాగుగాకుండా మాత్రం నేను వివాహం చేసుకోను.

కాని యీ పరిస్థితులు బాగుపడే సమయానికి తను వివాహం చేసుకునే స్థితిలో వుంటుందా!

నిర్మల రోజుకొకసారయినా చెప్తుంది. "నువ్వు తప్ప కుండా పెళ్ళిచేసుకోవాలి" అని.

స్నేహంకలసి నెలకూడ పూర్తికాలేదు. నిర్మల

ప్రాణంయిస్తుంది నేనంటే. ఆమె కనబరిచే నిండైన ప్రేమలో వుక్కిరి బిక్కిరవుతాను.

యీ సమాజంలోని మనుషుల మనస్తత్వం క్షుణ్ణంగా పరిశీలించిన మనిషి కాబట్టే నిర్మల నా వివాహానికి ప్రోత్సాహిస్తోంది.

కొత్తల్లో విశ్వనాథం గురించి గుచ్చి అడిగేది నిర్మల పోలీసులాగా - దొంగచేత దొంగతనాల వివరాలు బలవంతాన చెప్పిస్తున్నట్లుగా. మనసుకు ఎలాంటి బాధ కలుగకుండా నేర్పుగా అడిగేది.

తర్వాత తర్వాత విశ్వనాథం గురించి అడగడమే మానివేసింది.

నన్ను స్టడీచేసింది కామోసు.

ఒకరోజు నిర్మల యింటికి వచ్చి అమ్మతో అన్నది "పిన్నిగారూ! శాంత పెళ్ళి మిఠాయి ఎప్పుడు తినిపిస్తారు"అని.

"మీ చెల్లెల్నే అడగవమ్మా"

"యిప్పుడప్పుడే తినిపించనంటోంది..."

"మీ బాబాయికి తగ్గగానే నీకు మిఠాయి పెట్టిస్తానమ్మా!"

"నన్ను మరచిపోకండి పిన్నిగారూ..."

అటు అమ్మకీ, యిటు నిర్మలకూ నన్నొక యింటిదాన్ని చేయాలనే...

నా యీ జీవన స్రవంతి ఎటు తీసుకుపోతుందో నన్ను. అన్నింటికీ సిద్ధంగా ధైర్యంగా వున్నాను.

నిర్మల హాస్యంగానే అన్న మరోమాట గుర్తుకు వస్తోంది.

"నువ్వు గనక పెళ్ళిచేసుకోనన్నావంటే, యిట్టే ముప్పైఏళ్ళు వచ్చేస్తయ్. అప్పుడు పెళ్ళి ప్రకటనలు వేయించాల్సి వస్తుంది పేపర్లో" అని ఎగతాళి చేసింది.

తను నవ్వింది హాస్యానికి. విధివిలాసం చూడాలి!

ఆ రోజు డైరీ కాగితాలు నింపింది శాంత మనసులోని వ్యధ అంతా పెల్లుబికి రాగా.

♦ ♦ ♦

వారంరోజులు ఎలాంటి ప్రత్యేకత లేకుండా గడచిపోయినై.

మళ్ళీ ఆదివారంకూడ వచ్చింది. ఆ రోజు, నిర్మల వాళ్ళ యింటికి రమ్మంటే రహత్‌మహల్ వెళ్ళి తిరిగి వస్తున్నది... ప్రొద్దుననుండీ నిర్మలదగ్గరే వున్నది. ఆ పూట భోజనంకూడా వాళ్ళ యింట్లోనే చేసింది.

నిర్మల ఎంత మంచిదో అంతకు రెట్టింపు ఆమె భర్త...

వాళ్ళ ఆదరణలో, కబుర్లలో మధ్యాహ్నం రెండు గంటలయింది... యిక వెళ్ళాలని పనివుందని చెప్పి యింటికి బయలుదేరిన శాంత రహత్‌మహల్ స్టేజ్‌లో నిలబడింది.

అప్పుడే నెంబరు వన్ బస్సు వెళ్ళింది. యింకా కాసేపటికిగాని మరోబస్సురాదు స్టేషనుకు పోవడానికి...

రహత్‌మహల్ హాలులో ఏదో హిందీ పిక్చర్

వచ్చింది. మ్యాట్నీ జనం అప్పుడే క్యూలు తయారు చేస్తు న్నారు.

ఆ జనాన్ని చూస్తూ ఏదో ఆలోచిస్తున్న శాంత ఒక్క సారి వులిక్కిపడ్డది ఎవరో పేరుపెట్టి పిలిచేటప్పటికి.

"శాంతా దేవీ!"

"నాన్నగారూ!...మాష్టారు యిక్కడే వున్నారు... మనతో సినిమాకు తీసికెల్దామా..." విశ్వనాథంగారి చిన్న మ్మాయ్ అంటున్నది.

ఇటుతిరిగి చూచిన శాంతకు ఎదురుగా చిన్నకారు... డోర్ తెరచి యివతలకు వచ్చి నిలబడి పిలుస్తున్న విశ్వ నాథం... లోపల హైస్కూల్ సెక్రెటరీ రెడ్డిగారు. విశ్వ నాథంగారి పిల్లలు యిద్దరు. ఆ రోజు స్కూలులో కొత్తగా చేరినప్పుడు నోటికి వచ్చినట్లు వాగిన టీచరు హనుమా యమ్మ...

శాంత కలవరపడ్డది...'పీళ్ళెక్కడ దాపురించారురా' అని.

రెడ్డిగారు కారుదిగారు. శాంత నమస్కారం చేసింది; విశ్వనాథానికి, రెడ్డిగార్కి.

రెడ్డిదగ్గరకు వచ్చాడు...ఆయనకు నలభై అయిదుం టుంది వయుస్సు. కల్మషపు చూపులుచూస్తూ "మ్యాటినీకి వచ్చావా అమ్మాయ్" అన్నాడు గారపట్టిన పళ్ళు యికి లించి.

"కాదండి. బస్సుకోసం చూస్తున్నా ... యింటికి వెళ్ళాలండి.... తెలిసినవారుంటే యిక్కడికి వచ్చాను"

నిర్మల యింటికి వచ్చావని చెప్పకుండా ఏదో అనేసింది అప్పటికి తోచినట్లు.

పక్కనే హనుమాయమ్మ వచ్చి నుంచుని ముసి ముసి నవ్వులు నవ్వుతోంది.

"సినిమా చూడడం పాపంకాదుగా. మాతో సిని మాకు రండి" రెడ్డి ఆహ్వానం.

"అబ్బె వద్దులెండి యింటికి వెళ్ళాలి"

"యింటికి వెల్దురుగానిలెండి. హనుమాయమ్మగారుంది మీకు తోడు ... పిల్లలున్నారు. విశ్వనాథంగారున్నారు. అంతా సర్దాగా చూద్దాం" మళ్ళీ రెడ్డి బలవంతం చేసాడు.

యింతలో విశ్వనాథం చేతిలో టిక్కెట్లతో వచ్చాడు.

"ఎన్ని టిక్కెట్లు తీసుకున్నారు. శాంతాదేవికూడ వస్తున్నారు. మరొకటి తెండి" అన్నాడు సెక్రెటరీ రెడ్డి.

"శాంతాదేవి వస్తుందని ముందే ఆవిడకుకూడ టిక్కెట్టు తెచ్చానండోయ్" అన్నాడు విశ్వనాథం విమప్రు నవ్వు నవ్వుతూ...

శాంతకు మండుకొచ్చింది.

ఎవరిని అడిగి టిక్కెట్లు కొనుక్కొచ్చినట్టు? నా యిష్టా యిష్టాలు కనుక్కోకుండా ఏమిటీ వీరి బలవంతం!... శాంతకు విశ్వనాథాన్ని నమిలివేయ్యాలన్నంత కోపం వచ్చింది.

తమాయించుకుని "లేదండీ... టిక్కెట్టు యిచ్చే సెయ్యండి ఎవరికైనా... నాకు యింట్లో పనులున్నయ్... నే పోవాలి"

"వెళ్ళుదురుగాని లెండి. సినిమా చిన్నదే... అయిదు న్నరకల్లా అయిపోతుంది రండి న్యూస్‌రీల్ స్టార్టవుతుంది" అన్నాడు రెడ్డి.

"సాయంత్రంవరకూ రాకపోతే యింట్లో భయపడ్తారు. మధ్యాహ్నానికల్లా వచ్చేస్తానని చెప్పాను... కాదు మీరు వెళ్ళండి"

"మీ మాట మీదేగాని; మాది వినిపించుకోరన్న మాట... చుట్టాలు యింటికి వచ్చినట్లు ఎలాగో తెలుసుగా. అక్కడే వున్నారు అనుకొంటారు. యింటివారేమీ మరచి పోరుగదా... విశేషంగా ఆరింటికల్లా యింటికి జేరుతారు రండి" అన్నాడు విశ్వనాథం... శాంత మొండి సమాధానా నికి ముఖం చిట్లించి.

శాంతను అలా బతిమలాడటం హనుమాయమ్మకు నచ్చలేదు. తనను అవమానపరుస్తున్నట్లుగా బోధపడ్డది.

"రానంటుంటే బలవంతం ఎందుకులెండి వెళ్ళనివ్వండి విశ్వనాథంగారూ" అన్నది హనుమాయమ్మ.

"రాకపోవడమేమిటండీ. టిక్కెట్టు తీసుకువస్తిని. దానిని ఎవరికియ్యాలిప్పుడు. రండి శాంతాదేవీ. యీసారి కాదనకండి" అన్నాడు విశ్వనాథం అడుగు ముందుకువేస్తూ.

లోలోపల విశ్వనాథం అసభ్య ప్రవర్తనకు విసుక్కుంటూ; అయిష్టతగానే వారివెంట నడిచింది బలిపీఠానికి వెళ్ళే మేకలాగా.

హాలులోకి వెళ్ళాం‌దరూ. హనుమాయమ్మ పక్కగా విశ్వనాథం కూర్చున్నాడు. తర్వాత విశ్వనాథం పిల్లలు రెడ్డి

గారి చిన్న బాబు. ప్రక్కన శాంత, శాంతపక్కనే రెడ్డి...
ముందే అనుకుని కూర్చున్నట్లు కూర్చున్నారు.

లైట్లు ఆరి న్యూస్ మొదలయింది.

సెక్రటరీ రెడ్డి పెదాలపై వికృతమైన నవ్వుకూడా వ్యాపించింది.

న్యూస్‌రీల్ నడుస్తున్నా శాంత మనసు మనసులో లేదు.

తానొక నిర్జీవ శవమైనట్లు, రెడ్డి, విశ్వనాథం, శవాలను పీక్కుతినే రాబందులయినట్లు బాధపడసాగింది. ఆమె హృదయావేగం ఎక్కువైంది. వెంటనే సీటులోనుండి లేచి బయటపడి పారిపోదామన్నంత వుద్వేగంతో బాధపడ్డది.

కాని కుర్చీలో శిలాప్రతిమలా చైతన్యరహితంగా కూర్చుని ఎటో చూస్తున్నది... సినిమా మొదలయినా, ఏమి జరుగుతున్నదో ఆమెకు బోధపడడం లేదు.

యింతలో ఏదో భయంకర సన్నివేశం—తెరమీద.

రెడ్డిగారికొడుకు భయంతో పెద్ద కేకపెట్టి కుర్చీదిగి శాంత వొళ్ళోకివచ్చి పడ్డాడు.

పిల్లాడి కేకతో, వచ్చి వొళ్ళోపడడంతో శాంత ఈ లోకంలోకి వచ్చిపడ్డది. పిల్లాడి తల నిమురుతూ భయంలేదని సముదాయించింది.

"మరీ అల్లరి ఎక్కువైంది పీడకి. భయంలేమూ ఏమీ లేదు... దించేసెయ్యండి!" అన్నాడు రెడ్డిగారు. పిల్లాడిని కసిరాడు.

పిల్లవాడు మాత్రం శాంత వొడి దిగలేదు. శాంత యింకా పిల్లాడిని నిమురుతూ సముదాయిస్తూనే వుంది.

"అయితే యిదొకటా... మీకెందుకు. పిల్లాడిని నాకు యివ్వండి" అంటూ పిల్లాడిని శాంత చేతిలోనుండి లాక్కున్నాడు.

శాంత శరీరం జలదరించింది. పిల్లాడిని తీసుకునే మిషతో రెడ్డి రెండు చేతులతో శాంత వక్షభాగం స్పృశించాడు కావాలనే.

శాంత పరిస్థితి గ్రహించింది ఎర్రగా కాలిన యినుప శలాకతో శరీరాన్ని కాల్చినట్లు బాధపడ్డది శాంత.

మొట్టమొదట ఏదో అనుకోకుండా అలా జరిగి వుంటుందని సమర్థించుకున్నదిగాని ఆలోచించగా... సెక్రెటరీ రెడ్డిగారిపై అనుమానమే దృఢపడ్డది శాంత మనస్సులో. పిల్లాడిని ఇవ్వమంటే తనే దింపిపంపేది. అలా కలియబడి లాక్కునే అవసరం ఏమొచ్చింది. అని తర్కించుకుని రెడ్డి పొరపాటున అలా ప్రవర్తించలేదని ధృవపరచుకున్నది శాంత.

పిక్చర్ ఇంటర్‌వల్ కూడా యిచ్చారు. అప్పటివరకు కథ ఏం జరిగిందీ శాంత చూడనూలేదు, చూసినది అర్థం కానూ లేదు.

లైట్లు వెలగగానే సెక్రెటరీ రెడ్డిని చాలుగా పరిశీలించింది శాంత. కాని ఆయన ఏమీ జరుగనట్లు నిర్వికారంగా కూర్చుని వున్నాడు.

విశ్వనాథం చూపులు శాంతవైపు క్షణకాలం ప్రసరించి, రెడ్డిగారి చూపులను కలుసుకున్నై.

జవాబుగా రెడ్డిపెదిమెలపై కుటిల మందహాసం మెరిసింది.

ఇంటర్వెల్ పూర్తయింది. పిక్చర్ మళ్ళీ ప్రారంభమైంది.

ఇంటర్వెల్ సమయంలో చెప్పకుండా ఇంటికి వెళ్ళిపోదామనే శాంత వుద్దేశ్యం వుద్దేశ్యంగానే వుండిపోయింది. ఎందుకో సాహసించలేక పోయింది శాంత. తలనొప్పి అని వంకపెట్టి వెళ్ళిపోదామనుకొన్నది. కాని మూగగా, అచంచలంగా కూర్చుండిపోయింది బోనులో చిక్కిన కుందేలులాగా.

పిక్చరు ప్రారంభమయిన పది నిముషాలకు చీకట్లో తన ముందు ఒక చెయ్యి తారట్లాడడం కనిపెట్టింది శాంత.

తీరాచూస్తే ఏమీలేదు. భ్రమా అని తన భయానికి తనే నవ్వుకున్నది.

మరికొంతసేపటికి తన భుజాలమీదుగా ఏదో స్పర్శ జరుగుతూ వస్తున్నది.

శాంత అప్పుడు తను చూచింది భ్రమకాదని నిర్ధారణ చేసుకుంది.

అంతా అగమ్యగోచరంగా వున్నది. ఏమీ పాలుపోలేదు శాంతకు.

నిర్ణయం చేసుకునేలోపలే సెక్రటరీ రెడ్డి బలమైన హస్తం శాంత భుజాలమీదుగా దాటి దేనికోసమో వెతుకుతున్నది.

ఏదో అజ్ఞాతమైన శక్తి శాంతలో ప్రవేశించింది. వెంటనే కోపంతో వణుకుతూ లేచి నిలబడింది. శాంత కుడి చెయ్యి పట్టుకుని కూర్చోబెట్టే ప్రయత్నంచేసి విఫలుడై పోయాడు రెడ్డి. విదిలించిపారేసి శాంత విసురుగా హాలు బయటకు వచ్చేసింది.

కళ్ళు తిరుగుతున్నయ్... తలనొప్పి మొదలయింది. ఎలా వచ్చిపడిందో బస్ స్టేజ్‌లోకివచ్చి నుంచున్నది శాంత. అప్పుడే నెంబరు వన్ బస్సువచ్చి ఆగింది. వెంటనే ఎక్కింది.

బస్సులో కూర్చున్నంతసేపూ శాంతకు ముళ్ళమీద కూర్చున్నట్లే వుంది... ప్రతి మగాడిదృష్టి తనమీదేవున్నట్లు ఒంటిమీద జెర్రులు ప్రాకుతున్నట్లు బాధపడింది... కండక్టర్ టిక్కెట్టు పంచ్ చేస్తూ తననే గుచ్చిగుచ్చి చూస్తున్నాడు.

ప్రపంచంలో అంతా విశ్వనాథం, రెడ్డిలాంటి పురుషు లేనా ?... స్త్రీని సహోదరిగా చూసి గౌరవించే పురుషులే లేరా సంఘంలో !!...

సికింద్రాబాద్ స్టేషన్‌లో బస్సు ఆగింది. శాంత కలత చెందిన మనస్సుతో బస్సు దిగింది.

బస్ స్టాపులన్నీ క్యూలతో రద్దీగా వున్నై.

రక రకాల ఫ్యాషన్లు... టెరిలిన్స్— డెకరాన్స్...

హైహీల్స్... స్లీవ్ లెస్ జాకెట్స్, బాక్ లెస్ జాకెట్స్...

లిప్‌స్టిక్స్... పోనీ టెయిల్స్...

ఆధునికత సికింద్రాబాద్ స్టేషన్ ఆవరణలో విశృంఖలంగా విహారం సల్పుతోంది.

నాగరికత, బాక్ లెస్ జాకెట్స్... కొన్నాళ్ళు పోతే... మనిషి వొంటిమీద ఆచ్ఛాదనే వుండదు...

నాగరికతా చక్రమణం... ఫ్యాషన్లు...మళ్ళీ రాతి యుగానికి... చిరిగిపోయిన చరిత్ర పుటల్ని చీల్చుకుని నాగరికత, యుగాలవెనుకకు వెళుతుంది...

హైహీల్స్ కదంతొక్కుతూ వెళ్ళే ఒక ఆంగ్లో యిండియన్ వయ్యారి వెనుక టెక్సన్‌లా... కౌబాయ్ పాంట్ పొట్టి టీషర్ట్ తొడుక్కొని... బిగుతైన పాంటుతో నడవలేక కీళ్ళవాతపు రోగిలా అవస్థపడ్తూ ఫాలో అవుతున్నాడు ఒక హీరో.

టికెట్లు యిస్యూచేసే ఒక కండక్టర్‌ను టిక్కెట్టుకు డబ్బులిస్తూ ఒక ప్రబుద్ధుడు వెకిలిగా నవ్వుతున్నాడు...

నాంపల్లి వెళ్ళడానికి డబ్బులు లేవు "ఒక టెన్ యన్‌పి బిట్ యివ్వండి ప్లీజ్" అంటున్నాడు ఒక చిరిగిపోయిన ఖాకీకోటు, ఖాకీషర్ట్ వేసుకున్న, జనాన్ని మోసం చేయడం నేర్చుకున్న తెలివిమంతుడు.

ఎవరికి ఏభాషవస్తే ఆభాషలోనే అడుగుతాడతను, ఏభాష వచ్చో ముందే కనుక్కొని తర్వాతగాని తన కోర్కె వెళ్ళడించడు అతను.

అలా ప్రతిరోజూ వుదయంనుండీ సాయంత్రంవరకు అడిగినవాడిని అడగకుండా నాంపల్లి పోవడానికి పదిపైసల బిట్టు అడుగుతూనే వుంటాడు... ఒక్కోసారి అడిగినవాడిని అడగడం కూడ కద్దు.

రకరకాల జనసందోహాన్ని తప్పించుకొని ఫర్లాంగు నడిచి యింటికి చేరింది శాంత...

"మధ్యాహ్నమే వస్తానంటివి కదమ్మా" అన్నది తల్లి యింటికి చేరగానే.

"నిర్మల కదలనివ్వలేదమ్మా యింకా సాయంత్రం వరకూ వుండమని బలవంతం" అన్నది శాంత- ముఖంలో విచారఛాయలు కప్పిపెట్టుకో ప్రయత్నం చేస్తూ.

ఆదివారం.

"ఏం రాయాలో కూడా. తెలియని అయోమయ స్థితిలో పెట్టోన్నయ్ ఎదురు చూడని సంఘటనలు...

యివాళ కాలుజారి పడబోయి నిభాయించుకున్నాను...

వంద సంవత్సరాలు బతికి నేర్చుకోలేని అనుభవం సంపాదించాను.

సెక్రెటరీ రెడ్డి పాపి. అగ్నికి వాయువులా రెడ్డికి విశ్వనాథం గాలిగాడు... తేనెపూసిన కత్తులు వీరిద్దరూ...

హనుమాయమ్మ నీతిలేనిది. సెక్రెటరీ చేతిలో కీలు బొమ్మ అది.

అంత అవమానం ఏలా భరించగలిగానో అర్థం గాకుండా వుంది. వెంటనే చెంప పగలగొట్టాల్సింది. బుద్ధి వచ్చేది. అందరూ చేరి నానాగొడవ జరిగేది. నలుగురిలో పరువుపోయేది రెడ్డికి, విశ్వనాథానికి.

వారిని బయటను యీడ్వటంతో బాటు నేనూ నలుగురిలో నగుబాటు పాలుగావాల్సి వచ్చేది.

అంత కల్మషం వున్నా వాళ్ళు అందరిలో పెద్దమను షులుగానే చెలామణి అవుతున్నారు.

తను నలుగురిలో వారిని యాగీ ఎందుకు చేయలేక పోయింది!... అదే తనలోని బలహీనత.

యిలాంటి అధైర్యమూ, బలహీనతలే స్త్రీని అధో పతనానికి గురి చేస్తున్నయ్— వీటిని ఆసరాగా తీసుకునే పురుషుడు స్త్రీని లోకువగా చూస్తున్నాడు.

ఒక అమ్మాయ్ బజార్లో నడుస్తూ వుంటుంది ఎవడో వెంటబడి వెకిలివేషం వేస్తాడు. వెంటనే కాలిచెప్పుతో సంభావన యిచ్చారంటే వాడిరోగం కుదురుతుంది. కాని ఆ అమ్మాయ్ అలాచేయదు, చేయడానికి ధైర్యకూడ లేదు... గొడవచేస్తే జనం పోగవుతారు. వాడిని నాలుగు తన్నినా, తననూ అనుమానించక పోరనేభయం ఆ అమ్మాయికీవున్నది "నీవూ అలాంటిదానివే కామోసు... అందుకే నీ వెంటపడ్డాడు వాడు అని అంటారు" అని ఆ అమ్మాయి భయం.

యీ సంకోచంతోనే స్త్రీ సగం పతినమౌతున్నది.

మేకలాగా, గోవులాగా సాధువులా వున్నంతవరకు స్త్రీకి సంఘంలో అవమానమే గతి. స్త్రీని పురుషుడు గౌరవించలేడు. అవమానించడం చాతనవును.

రేపు బడికి వెళ్ళగాని వీరికి బుద్ధిచెప్పను... ఎలా చెప్పాలి... ఏంచేయాలో బోధపడడం లేదు. తను తృణీకరించినదని ఎదురు తిన్నపైనె కక్ష సాధించుకుగదా పిల్ళు, అంతా వాళ్ళ చేతుల్లోనే వున్నది. రేపటినుండి వుద్యోగం

లోకి రావద్దంటారు... హే! భగవాన్! ఎలాంటి పరిస్థితిని సృష్టించావు?

కాని వుద్యోగం నుండి యింత త్వరగా స్వస్థి చెప్ప రనుకుంటాను... క్లాసు పిల్లలంతా నేనంటే ప్రాణమిస్తారు. స్కూలు ప్రెసిడెంట్, నేనంటే మేరీ ఆనందముతో తన విషయం మెచ్చుకుంటూ చెప్పడం తను స్వయంగా విన్నది. సెక్రెటరీ ఫల్ల వేసినా ఆయన ఒప్పుకోడు.

విశ్వనాథానికి, రెడ్డికి ఎందుకింత స్నేహమున్నదో యివాళ అర్థమైంది... యీసారి విశ్వనాథం తటస్థపడ్డప్పుడు అంతా అడుగుతాను.

విశ్వనాథం నాకు సహాయం చేసాడు. ఒప్పుకుంటాను. ఆయన అంటే గౌరవం, అభిమానం రెండూ వున్నై. కాని సహాయం చేసింది, నమ్మి మోసగించడానికా?

సెక్రెటరీ రెడ్డి రేపు యే మొహంపెట్టుకుని తనకు కని పిస్తాడో చూడాలి. యీ విషయం నాన్నతోగాని, అమ్మతో గాని చెప్పడం మంచిదికాదు. అసలే మంచంలో వున్న తండ్రి యీ విషయంతో మరీ కృంగిపోతాడు... వుద్యోగం వదలివేయమని చెప్తారు. వుద్యోగం మానేస్తే, తండ్రికి మందులు, పిల్లల చదువు ఎలా సాగుతై?... సంసారం గడవడానికి ఆధారం ఏమిటి?

మరో సంవత్సరంలో నాన్న చెయ్యి, కాలు నెమ్మ దించి- అంతా చక్కబడుతుంది. అప్పుడు తను వుద్యోగం మానినా ఫరవాలేదు.

ప్రస్తుతం ఆలాంటిపని చేయకూడదు.- యిప్పుడు నేను వుద్యోగం మానితే సంసారం నడిసముద్రంలో చిక్కుకున్న నావలా అవస్థల పాలవుతుంది.

నిర్మలకు యివాళ్టి సంఘటన చెప్పితే ఏమంటుందో చూడాలి.



సోమవారం.

నేను భయపడినంత రగడ చేయలేదు యీ రెడ్డిగారు. బళ్ళో అందరికీ తెలిసేటట్లు చేస్తారనీ, బడికి పోగానే నన్ను అంతా వింతగా చూస్తారని అనుకున్నాను. రెడ్డిగారు బడికి వచ్చికూడ, ఏమీ జరుగనట్లు మామూలుగానే వున్నాడు.

ఆఫీసులో రెడ్డిగారు కూర్చుని ఉన్నాడు. నేను ఏదో పనుండి అటుగా వెళ్ళాల్సి వచ్చింది. ఏమీ ప్రత్యేకత లేకుండా, సహజధోరణిలో, క్లాసు విషయాలు అడిగాడు; నిన్నటిరోజున ఏమీ జరుగనట్లు, జరిగిన సంఘటనకు అస్తిత్వమే లేనట్లు...

హనుమాయమ్మ, లలితాంబ మాటల్లో అవహేళన ధ్వనించింది. హనుమాయమ్మ మరీ వింతగా చూచింది నన్ను. వాళ్ళలో వాళ్ళు ఏవేవో నన్ను వుద్దేశించి అనుకున్నారు వాళ్ళు.

చదువుకుని, బుద్ధీ జ్ఞానం సంపాదించుకున్నవాళ్ళు యింత అసహ్యంగా ఎలా ప్రవర్తించగలుగుతారో అర్థం కావడంలేదు.

పురుషుడికన్న ఎక్కువ స్త్రీ మర్యాద ఎరిగి మసలు కోవాలి... యీ విషయంలో స్త్రీ కర్తవ్యం మహోన్నత మైనది... ఒక కుటుంబంలో పురుషుడు వట్టి జులాయి అయినా, స్త్రీ యోగ్యురాలయితే ఏ ఒడుదుడుకులు లేకుండా సంసారం చక్కబెట్టుకోగలుగుతుంది.

ఒక సంసారంలో గృహస్థు మరణిస్తే గృహిణి, సంసారభారం వహించి అంతా నిర్వహించగలుగుతుంది. కాని గృహిణి మరణిస్తే గృహస్తు బాధ్యత నిర్వహించ డంలో సఫలీకృతుడు కాలేడు.

అలాంటి వున్నతకర్తవ్యంగల స్త్రీగా పుట్టిన హనుమా యమ్మ... స్త్రీయేనా... సెక్రటరీ చేతుల్లోని కీలుబొమ్మ... కులటలకీ వాళ్ళకీ తేడా ఏమిటి?

మరీ హనుమాయమ్మ, లలితాంబ బరితెగించారు. పైకి మాట్లాడకపోయినా, వాళ్ళిద్దరంటే అందరికీ అసహ్యమే.

టీచర్సరూంలో మధ్యాహ్నం రీసెస్‌లో పుస్తకం చదువుతూ కూర్చున్నాను.

హనుమాయమ్మ అన్నది లలితాంబతో... "మహా రాణి దిగ్విజయయాత్ర ప్రారంభమయింది" అని.

లలితాంబ పగలబడి నవ్వింది.

"నాకు కూడా ఎవరన్నా సినిమాలు చూపిస్తే బాగుండు!"

మళ్ళీ ఒక వికృతమైన నవ్వు.

"నీ కెవరు చూపిస్తార్లే సినిమాలు. నువ్వేమైనా

బి. యే. చదివి మానేసావా...కాలేజీ మొహం ఎలా వుంటుందో తెలియదు"

అప్పుడే లేచి హనుమాయమ్మ లలితాంబ చెంపలు పగలగొట్టుదా మనిపించింది.

మిగతా టీచర్లకుకూడ వారి ధోరణి నచ్చలేదు.

నిర్మల యివాళ ఎందుకు రాలేదో అర్థంకావడంలేదు. నిన్న మాటమాత్రం కూడ నాతో అనలేదు. వొంట్లో కులాసాగ వుందో లేదో ఎలా తెలుస్తుంది. రేపుకూడ రాక పోతే ఒకసారి వీలుచూచుకుని వెళ్ళిరావాలి."

డైరీ మూసి, ఆలోచనలు వుక్కిరి బిక్కిరి చేస్తుంటే పడుకున్నది శాంత.

♦ ♦ ♦

శాంత పిల్లలకు చెప్పాల్సిన నోట్సు తీసుకుని స్కూలుకు బయలు దేరింది.

"తొమ్మిదికూడ కాలేదు. అప్పుడే ఎక్కడికే అమ్మాయ్" అన్నది తల్లి సరస్వతమ్మ.

"మొన్న; నిన్న నిర్మలక్కయ్యబడికి రాలేదమ్మా... జ్వరమేమైనా వచ్చిందేమో...చూచి వద్దామని." అన్నది శాంత.

సరస్వతమ్మ ఆందోళన వ్యక్త పరిచింది. నిర్మలను కూతురిలాగానే చూస్తున్నది. శాంతకు పరిచయమైనప్పటి నుండీ సరస్వతమ్మ.

"ఆదివారం వెళ్ళొచ్చావుగదమ్మా ... అప్పుడు కులాసాగానే వున్నదిగదూ !"

"ఆ రోజు బాగానే వున్నది... వచ్చే జబ్బులు చెప్పి వస్తయ్యా... ఎందుకు రావడంలేదో... ఆదుర్దాపట్టలేక నేనే అలా వెళ్ళి స్కూలుకు వెళ్దామనుకుంటున్నా" అన్నది శాంత.

"అయ్యో పాపం...పిచ్చితల్లి ... ఎంత సరదాగా మాట్లాతుందో. చూసిరా"

శాంత రహత్‌మహల్ వెళ్ళి నిర్మల యింటి గుమ్మంలో అడుగు పెట్టేప్పటికి, నిర్మల చిరునవ్వుతో ఎదు రయింది.

"అరే శాంతా యిదేమిటే, ఈ వేళప్పుడు బాబాయి గారి ఆరోగ్యం బాగుందిగదా!" అన్నది నిర్మల ఆశ్చ ర్యంతో.

"భయపడకు. అలాంటిదేమీ లేదుగానీ...నువ్వు రెండురోజులు కనబడకపోయేటప్పటికి మాకే భయమేసింది. ఒంట్లోనలతగావుందేమోనని ఆదుర్దాగా పరిగెత్తుకొచ్చాను" అన్నది.

నిర్మల నవ్వసాగింది...

"ఓసి పిచ్చీ ... అంతపిరికిదానివా... నేనంటే ఎంత ప్రేమో యీ పిచ్చికి" అని వచ్చి శాంతను తన రెండుచేతు లలో బిగించివేసింది.

"బావగారు లేరేమిటి!"

"నువ్వురాక ముందే వెళ్ళిపోయారు ... పనివున్న దంటూ... మన వుద్యోగమేసయం... వేళా పాళా లేకుండా తిరగక్కర్లేదు"

"పద... పని ఏమైనా వుందా!"

"లేదు. నేనూ స్కూలుకే బయలు దేరాను శాస్త ఆలస్యంగా వచ్చినట్లయితే నువ్వు యిక్కడికి రావడం వృధానే అయ్యేది"

యిద్దరూ బయటపడి, స్కూలుకు బయలుదేరారు.

స్టేషన్లోదిగి...నడకసాగించారు. యింకా సమయం వున్నదని తాపీగా నడుస్తూ వెల్తున్నారిద్దరూ.

శాంత ముఖకవళికలు, ప్రవర్తనచూసి ఏదో చెప్పాలని ఆతృతగా వున్నట్లు అనుమానించి... "ఏమిటి పిచ్చి అలా వున్నావ్... ఏమైనా విశేషమూ... చెప్పుమూ." అన్నది నిర్మల.

శాంత నిర్విణ్ణురాలయింది...తన మనస్సులోని మాట కనిపెట్టిందనే సంభ్రమాశ్చర్యాలతో, క్షణ కాలం స్థబ్దురాలయింది శాంత.

"చెప్పు. ఎందుకలా నీలో నీవు బాధపడ్తావ్..."

శాంత జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పింది. చెప్పి నిర్మల మొహంలోకి తదేకంగా చూసింది సాఘటన ఆమెపై ఎలాంటి ప్రభావం కలుగ జేసిందా అని, ఏ సలహా యిస్తుందా అని.

"పిచ్చి... వాళ్ళతో మొట్టమొదటే సినిమాకురానని ఖరాఖండీగా చెప్పేయాల్సింది నువ్వు"

"నన్ను అడగకుండానే టిక్కెట్లు తెచ్చి రమ్మని వేధిస్తే, పోక ఏం జేయను అక్క" అన్నది శాంత.

"నీకు ముందే చెప్పాను; సెక్రెటరీ రెడ్డి దుష్టుడని, జాగ్రత్తగా వుండమని. జరిగిందేదో జరిగింది. యిక ముందయినా వారి జోలికి పోకు" అన్నది నిర్మల హెచ్చరింపుగా.

"యిహ... ఒకసారి బుద్ధివచ్చిన తర్వాత మళ్ళీ అటువంటి పొరపాటు పనిచేస్తానా... ఇప్పుడు జరిగినదానికి ఏం చేద్దాం... ప్రెసిడెంట్‌తో చెప్పనా?"

"వద్దు... ఆపని చేయకు. యింకా రెడ్డిని పూర్తిగా అర్థంచేసుకోలేదు నువ్వు" అన్నది ఎటోఆలోచిస్తూ.

శాంత నిర్మలముఖంలోకి చూస్తూ వుండిపోయింది.

"ప్రెసిడెంట్‌తో చెప్తావనుకో... నీ మాటలమీద నమ్మకం ఏర్పడుతుందని నిర్ధారణ ఏమిటి!... అటు రెడ్డి కూడ వున్నవీ లేనివీ అన్నీ చెపుతాడు... హనుమాయమ్మ వాడిపక్షమే. నిన్ను సమర్థించేదెవరు యిహ..." అన్నది నిర్మల.

యిద్దరిమధ్య కొంచెంసేపు గంభీరత వ్యాపించింది... తిరిగి నిర్మలే అన్నది..."యింకోవిషయం హనుమాయమ్మ అసలే బజారునపడ్డ రకం. నిన్ను నగుబాటు చేయాలని ప్రయత్నించినా ప్రయత్నిస్తుంది."

"అయితే"

"యింకా అయితే ఏమిటి..."

"యీ విషయాన్ని యింతటితో ఆపివెయ్ మెదలకుండా వూరుకో."

"మెదలకుండావూరుకుంటే రెడ్డిని యిటువంటి వ్యవహారాల్లో ప్రోత్సహించడమే అవుతుంది. కుక్క అన్నతర్వాత

దాలిగుంటలో పొర్లకుండా వుంటుందా. ఎప్పుడో అప్పుడు మళ్ళీ యిలాంటి చేష్టలు చేయకపోడు. ప్రెసిడెంట్ చెవిని వేస్తే యీ విషయం... ముందు ముందు మనకు ఉపయోగిస్తుంది."

"అదీ నిజమే"

"ఆలోచించు. నీ యిష్టమైతే వెళ్ళి చెబుదాం ఆయనకు. నువ్వుకూడా రావాలి."

"రావడానికేంగాని... మరోవిషయం పట్టుకుంది నాకు..."

"యింకేమిటి..."

"నీ వుద్యోగం విషయం ఆలోచించొద్దా ఏమిటి?... యింటి పరిస్థితేమో అలావుండె. బాబాయిగారు లేవలేని స్థితిలో వుండిరి. విజయ, దుర్గ, తమ్ముడు చదువుకోవాలా?... నీ వుద్యోగమూపోతే... ఎలా గడుపుతావు?"

"మరి నన్నేం చెయ్యమన్నావో చెప్పు... మన తప్పు వున్నట్లు మెదలకుండా వూరుకోడం మంచిదికాదేమో" వుద్విగ్నురాలై అన్నది శాంత.

"ప్రెసిడెంట్ పిల్లలకు నేను ట్యూషను చెప్పుతున్నాను. ఎప్పుడో వీలుచూచుకుని నేనే ఆయనతో చెప్తాను. ఎవరు చెబితే వారిమాటలు నమ్మేరకం ఆయన. బుద్ధావతారం... సెక్రెటరీ చెప్పకుండా వుంటాడా... జాగ్రత్తగా ఆయన చెవిన వెయ్యాలి యీ విషయాన్ని"

"సరే... అలాగే చెయ్..."

"యిక ముందన్నా జాగ్రత్తగా వుండు. లేకపోతే అక్కయ్యచేత దెబ్బలు తింటావు" నిర్మల నవ్వుతూ అన్నది.

శాంత నిర్మల స్నేహ వైఖరితో పులకించిపోయింది. "నాకు పెద్దఅక్కయ్య లేకపోతేనేం... నిర్మల నాకు అక్క కంటె ఎక్కువ" అనుకున్నది.

"స్కూలులో పిల్లల్ని కొట్టేరూల్ లేదు... కొత్త వూరుకోరు... తెలుసుగదా!"

"కాని నాకు ఏ రూలూ వర్తించదు... మాట వినకపోతే దబదబా వాయించేయడమే" అని గంభీరత నిలుపుకో లేక నవ్వేసింది నిర్మల.

శాంత ఆమెతో గొంతు కలిపింది.



నిర్మలతో జరిగిన విషయం చెప్పుకుని చర్చించిన తర్వాతగాని శాంత మనసు కుదుటబడలేదు.

నిర్మలతోతప్ప ఆ ప్రస్తావన మరెవరితోనూ తేలేదు కూడ.

అలా చెప్పడంవల్ల సానుభూతి, సలహాలు, లేకపోగా ఎదురు తననే శంకిస్తారని భయపడ్డది.

నిర్మలతో చెప్పుకుని ఆమెతో మనసు విప్పి మాట్లాడిన తర్వాత తలనుండి పెద్దభారం దించివేసినట్లుగా అనుభూతి పొందింది శాంత.

హనుమాయమ్మగారు, మరెవరయినా అనవసరంగా వాగినట్లయితే తగిన జవాబు యివ్వాలని దృఢంగా నిశ్చయించుకున్నది శాంత.

స్కూలులో మునుపటిలా హనుమాయమ్మ ఏమీ నోరు జారలేదు. శాంత ముఖంలో కనబడే స్థయిర్యం, ఆమెకు పిరికిమందు పోసివుండవచ్చు... కొద్దిగా మారిన వాతావరణానికి శాంత కాస్త సంతోషించింది.

ఒకసారి లలితాంబ అలవాటుచొప్పున శాంత రాగానే "రాణీగారొచ్చారు... పహరా హుషార్!!" అన్నది.

హనుమాయమ్మ నవ్వలేదు, తుక్కిన పేనులాగా దిక్కులు చూస్తూ వుండిపోయింది.

ఎవరూ నవ్వక పోయేటప్పటికి తను ఒక్కతే నవ్వి, సిగ్గుపడి మొహం యింత చేసుకున్నది....

అందరిముందు, అదిరిపాటుకు మంచి పరాభవమే జరిగింది....

తర్వాత లలితాంబకూడ నోరెత్తితే ఒట్టు... కిక్కురుమనలేదు.

హనుమాయమ్మ అదిరిపాటు తగ్గడానికి కారణం శాంత నొసలు చిట్లించి కోపంగా చూడడమే... శాంత వూరుకోదు అని హనుమాయమ్మ గ్రహించింది.

అది అలావుంచి ఆరోజు ప్రత్యేకత హెడ్‌మిస్ట్రెస్ మేరీ ఆనందం ప్రవర్తన. రోజూకన్న విపరీతంగా, భిన్నంగా వుంది.

శాంత స్కూలుకు రాగానే ప్యూనుచేత కబురు పంపింది...

శాంత వెళ్ళగానే... "మీక్లాసు ఫీజు పూర్తిగా వసూలుకాలేదు" అన్నది దురుసుగా. శాంతకు వుద్రేకం

వచ్చింది... మెత్తగావుంటే ప్రయోజనం లేదని... తగ్గట్టుగానే.

"దానికి నేనేం చేయగలను?" అన్నది శాంత.

మేరీ ఆనందం విద్యుద్ఘాతం తగిలినట్లు అయిపోయింది. శాంత తనంత దురుసుగానూ జవాబు చెబుతుందని ఆమె కలలోకూడ ఆశించలేదు.

వెంటనే ధోరణి మార్చుకుని. సాధ్యమైనంత సౌమ్యత మాటల్లో జోడిస్తూ.

"పిల్లలకి కాస్త గట్టిగా చెప్పండి అంతే యిహ మీరు వెళ్ళొచ్చు" అన్నది.

శాంత వెనుదిరిగి వెళ్ళబోయే వేళ్టికి "మరిచా. ఇటు చూడండి" అన్నది మళ్ళీ.

శాంత ఆగి ఏమిటన్నట్లు చూచింది.

"ఇండిపెండెన్స్‌డే వస్తున్నది గదా... లోయర్ ఫారమ్స్‌లో పిల్లల్ని హనుమాయమ్మగారు మీరూ కలిసి కొంతమందిని ఏరి చిన్న నాటిక ప్రాక్టీస్ చేయించండి"

"హనుమాయమ్మగారితో కుదరదులెండి. నేను చేయలేను" అన్నది శాంత నిర్మోహమాటంగా.

"ఎందుకు?..."

శాంత నిర్దిష్టమైన జవాబు ఏమీ యివ్వలేకపోయింది

"మీ వ్యక్తిగత తగాదాలు వుంటే వుండవచ్చు గాక. స్కూలు వ్యవహారాలు నే చెప్పినట్లు చేయాల్సిందే... సెక్రెటరీగారి మాటయిది" అన్నది తీవ్రంగా హెడ్‌మిస్ట్రెస్.

తిరిగి జవాబు ఆశించకుండానే "యివాళ రీసెస్‌లో యిక్కడికి రండి మీరు. హనుమాయమ్మను కూడ పిలిపిస్తాను. ప్రోగ్రాం తయారుచేద్దాం యిహ వెళ్ళండి" అన్నది మళ్ళీ. తనొక నియంత అయినట్లు- తను చెప్పిందే శాసనమయినట్లు.

శాంత విసురుగా బయటకు వచ్చేసింది. యివాళ మేరీ ఆనందం విచిత్ర ప్రవర్తనకు కారణం ఆమెకు బోధపడలేదు.

సెక్రెటరీ ఏమన్నా చెప్పాడేమో. అసలు ఈ హెడ్ మిస్ట్రెస్ ఒక టక్కులమారిది. సెక్రెటరీతో సిగ్గులేకుండా ఆఫీసు రూంలో గుసగుసలు... పగలబడి నవ్వడం...

ఒక సంస్థను చక్కదిద్దాల్సిన ఆమే అలా నీతి దిగజారిపోయి వుంటే వందలాది పిల్లల గతి ఏమికాను.

ఆమె క్లాసులో కూర్చున్నా మనసులో చిక్కచిక్కగా ఆలోచనలు వ్యాపించినై... ఏమీ చెప్పలేకపోయింది ఆరోజు.

♦ ♦ ♦ ♦

చెప్పుకోదగ్గ సంఘటనలేవీ లేకుండానే సంవత్సరం జరిగిపోయింది వెసక్కి...

కాళిదాసు చెయ్యి తగ్గి కాలు అలాగే వున్నది ఔడుగా...

శాంత జీవితం ఒక నిశ్చల ప్రవాహంలా సాగిపోతోంది.

విశ్వనాథం ట్యూషన్లు మానివేసింది శాంత... వచ్చే నూటయాభై తోనే వెళ్ళదీస్తోంది ఎలాగో.

మానేస్తున్నానని చెప్పిన రోజున కారణం పదేపదే అడిగాడు విశ్వనాథం.

ఏమీ లేదని తప్పించుకున్నది. శాంత...



ఆరోజు... ఆదివారం. సాయంత్రం ఆరు కావస్తోంది. కింగ్స్‌వేలో తల్లికి చీర, తమ్ముడికి షర్టింగ్, తండ్రికి గ్లాస్కో ధోవతి కొని ప్యాక్ చేయించుకుని వస్తున్నది...

వాతావరణం చల్లగా వుంది. కింగ్స్‌వే విశాలంగా, ఠీవిగా వున్నా మంచి రద్దీగావుంది.

రోడ్డు కిరువైపులా "ఫారెస్ట్ ఫైర్స్" ఎర్రగా నిండుగా నవ్వుతున్నాయి. పాట్నీ సెంటర్‌లో రోడ్డు దాటలేక ఫుట్‌పాత్ మీద నిలబడిపోయింది శాంత. ట్రాఫిక్ మరీ ఎక్కువగా వుంది. బస్సులూ, టాక్సీలూ, రొద చేస్తున్నయ్.

టెలిఫోను ఎక్స్ఛేంజి ముందు చెట్టుకింద యిద్దరు హీరోలు అటుగా పోయే ఆడపిల్లలకు పోజుకొట్టున్నారు.

ఎదురుగా "సబానా" కాంటీన్‌లోకి ఆంగ్లోయిండియన్ మెయిడ్స్ హస్తస్పర్శలకోసం టీతాగే వంకతో ఒక్కొక్కరే దూరుతున్నారు.

యింతలో ఒక చిన్న కారు వచ్చి శాంత పక్కగా ఆగింది.

శాంత 'ట్రాఫిక్ క్లియ్‌రెన్స్' కోసం చూస్తున్నదల్లా వులిక్కిబడి అటుచూచింది.

విశ్వనాథం తల బయటపెట్టి.

"శాంతాదేవి యిక్కడున్నారేమిటీ!" అన్నాడు.

తను ఎందుకు వచ్చిందీ. శాంత చెప్పింది...

రోడ్డుమీద, కారు ఆపి ఏదో పని వున్నట్లు మాట్లాడించడం సభ్యతేనా...

'ఏమిటీ యీాయనతత్వం' అనుకుంటున్నది శాంత.

"అయితే రండి... నాకూ పని ఏమీ లేదు, అలా వెళ్ళొద్దాం..."

"అబ్బె... నాకు పనివుందండి... త్వరగా యింటికి చేరాలి"

"ఆదివారమే కదండీ. యిప్పుడే వద్దాం... టాంక్ బండ్ వరకూ వెళ్ళొద్దాం. మీారు పనిలేదని ఎప్పుడూ అనరుగదా!" విశ్వనాథం కళ్ళు చిన్నవిచేసి నవ్వుతున్నాడు.

ఆ నవ్వులో యిసుమంత అపహాస్యంకూడ వుండక పోలేదు. ఆ సంగతి శాంతకూడ గ్రహించగల్గింది.

శాంత జవాబుయివ్వలేదు. ఆమెకూడ ఒక చిరునవ్వు నవ్వి వూరుకున్నది.

విశ్వనాథం యిలా ఎందుకు ప్రవర్తిస్తాడో బోధపడ లేదు శాంతకు. ఆరోజు యింటికి వచ్చినప్పుడుకూడ యిలాగే నవ్వాడు.

విశ్వనాథం కారుదిగి డోర్ తెరచి పట్టుకుని "రండీ... మీారు మరీని... అర్ధగంటలో పని మించిపోయింది ఏమిటీ" అన్నాడు విశ్వనాథం మళ్ళీ రెట్టిస్తూ.

"నా మనసేం బాగోలేదు...యింట్లో ఎదురుచూస్తూ వుంటారుకూడ. ప్లీజ్ వెళ్ళిరండి— సారీ!"

"మనసు బాగాలేకపోతే... అలా అలా తిరిగివస్తే హాయిగా వుంటుంది శాంతాదేవీ... ప్లీజ్ రండి...యిప్పుడే వద్దాం" అన్నాడు.

శాంతకు ముళ్ళమీద నిలబడినట్లు వున్నది... "నడి రోడ్డులో నిలవేసి యీ బలవంతమేమిటి... స్కూలు పిల్లలు గాని, టీచర్లుగాని చూస్తే పెడర్థాలు పట్టిస్తారు... నే నేజవాబు యివ్వను" అనుకున్నదామె.

"యీసారికి క్షమించండి... నా మనసేమీ బాగా లేదు"

"గనుకనే రమ్మనేది... అయినా నాపై మీకు నమ్మకం లేకపోతే... రావద్దులెండి... మీకు మామీద కోపంకూడ వచ్చిందన్నమాట... మా పిల్లలకు ట్యూషను కూడ మానివేసారు" దెప్పినట్లు మాట్లాడాడు విశ్వనాథం.

శాంత యిప్పుడు కూడా నోరు మెదపలేదు. మనసు లోనే తర్కించుకున్నది. "అనవసరంగా విశ్వనాథంగార్ని అనుమానిస్తున్నానా?...సినిమాహాల్లో వెకిలిచేష్టలు చేసింది రెడ్డిగారు. యీయన అలా అసభ్యంగా ఎన్నడూ ప్రవర్తించ లేదు. తనకు వుద్యోగం రావడానికి ముఖ్యమైన కారకుడు యీయనే...కొన్నాళ్ళు తండ్రికి మందులుకూడ యిప్పిం చాడు...ఏవో చిన్న చిన్న సంఘటనలు ఆధారంచేసికొని అనవసరంగా అనుమానిస్తున్నదా తను. ఏమో. అంతా అగమ్యంగా వున్నది.

ఆయన చేసిన మేలు గుర్తుకు వచ్చేటప్పటికి ఆమె మనసు ఆయన ముందు అనవతమైపోయింది. యిక కాదన లేక, ఒక అడుగు ముందుకు వేసింది.

"అలా అపార్థం చేసుకోకండి ... మీరు చేసిన సహాయం మేము మరచిపోగలమా? ... ప్రతిరోజూ అంత దూరం రాలేక మీ ట్యూషన్ మాని వేశానుగాని" అన్నది.

"మాటవరసకు అన్నానంతే ... ఎలాగైతేనేం మిమ్మల్ని ఒప్పించేటప్పటికి తాతలు దిగివచ్చారండీ..." అంటూ డోర్ తెరిచి యిలా కూర్చోండి అన్నాడు. ఫ్రంట్ సీట్లో కూర్చున్నది శాంత... బలవంతాన ఎవరో కూర్చొ బెట్టినట్లు.

విశ్వనాథం కారుని తెప్పుకు పోసాడు. తాజ్‌మహల్ హోటల్‌లో ఫ్యామిలీ రూంలోనుండి రెడ్డి, హనుమాయమ్మ పగలబడి నవ్వుతూ ఒకరి నొకరు పూసుకుని, మెట్లుదిగుతూ వుండడం చూచింది శాంత.

విశ్వనాథం చూడలేదు. అతనిదృష్టి రోడ్డుమీదకు వున్నది.

శాంత లోలోపలే అసహ్యించుకున్నది. హనుమా యమ్మ నాటకానికి.

స్టేడ్ ఫోటోసెంటర్, మౌంటీస్ రెస్టారెంట్ దాటి పారడైజ్ స్క్వేర్‌లో కుడివైపుకు తిరిగింది కారు.

శాంత అదిరిపడింది. టాంక్ బండ్‌కు పోవాలంటే ఎడమవైపుకు తిరగాలి....

కాని కుడివైపుకు తిరిగి, సెంట్రల్ టెలిగ్రాఫ్ ఆఫీసు పక్కగా మళ్ళీ లెఫ్టుకు తిరిగింది కారు.

శాంతకి విశ్వనాథానికి నడుమ అంతవరకు నిశ్శబ్దంగానే గడిచింది.

ఇప్పుడు శాంత హృదయావేగం ఎక్కువైంది. ఇప్పుడు జరిగినదంతా కలా, యదార్థమా అనుకుంటున్నది. విశ్వనాథాన్ని నమ్మి తను యిలా అతనితో బయలుదేరింది. ముందు ఏమీ జరిగేదీ అంతా అగమ్యగోచరంగా వున్నది. ఏదో దుస్వప్నం కంటున్నట్లు, ఆమె మొహం భయభ్రాంతమైంది.

సాధ్యమైనంతవరకు పిరికితనం కనబడనీయకుండా "యిటు ఎక్కడికి వెళ్తున్నారు. టాంక్ బండ్ రూట్ మరచిపోయారేమిటి?" అన్నది శాంత.

ఆమె అన్నమాటలు ఒక పెద్ద హాలులో ధ్వని ప్రతిధ్వనించినట్లు ఆమెకే తిరిగి భయంకరంగా వినిపించినై. కారు ఛర్రున కోడిత్రాచులా ముందుకు దూసుకుపోతూంటే, విశాలమైన సిమెంటురోడ్డూ, పచ్చటి చెట్లూ, విద్యుద్దీపాలతో వెలిగిపోతున్న పట్టణమూ, రాత్రికి, పగటికి మధ్య సంధికాలంలో ఆకాశం పులుముకున్న వింతరంగూ మనుషులూ అంతా వెనుకబడిపోతున్నారు.

విశ్వనాథం ముఖం గంభీరంగా వున్నది. ఆ గంభీరత వెనుక ఎలాంటి గుప్తమైన భావం దాగొనిఉన్నదో, క్షణక్షణానికి ఆయన ముఖంలో గాంభీర్యత గాఢమవుతున్నది.

శాంత విచలితురాలై "యిటెక్కడికండీ..." అన్నది.

అప్పటివరకూ ఆమె మాటలే విననట్లు, అప్పుడే శాంత అడిగినది వినబడినట్లు.

"ఏమిటీ..." అన్నాడు.

కారు మరికాస్త వేగం పుంజుకున్నదని అటువంటి పరిస్థితిలోకూడ శాంత గ్రహించగల్గింది.

"టాంక్ బండ్ యిటు కాదుగా. యిటు ఎక్కడికి వెళ్తున్నారు!"

"టాంక్ బండ్ కు కాదు"

"మరి"

"బంజారాహిల్స్"

"అక్కడ ఏముంది..."

"మా యిల్లు... పెద్ద తోట... అభ్యంతరమా..."

అప్పుడే చీకట్లు వ్యాపిస్తున్నయ్... ఆ వేగంలో శాంతకు బయటిప్రపంచానికే, అస్తిత్వం లేనట్లు, ఆ కారు ఒకటే ప్రపంచంలో నిజమయినట్లు తోచింది. బయట విద్యుద్దీపాల వెలుతురు, చీకట్లు తప్ప మరేమీ కనిపించడంలేదు శాంతకు.

"అయితే యిక్కడే దింపెయ్యండి. నేను బస్సులో వెళ్తాను" అన్నది.

శాంత మనసులో అనిర్వచనీయమైన భయం ఆవరించింది. ఏదో కీడు శంకించింది ఆమె మనసు.

శాంత ముఖంలోని భావాలు చదివినట్లుగా "మీకేం భయం లేదు...మిమ్మల్ని మీ యింటిదగ్గర దింపుతానుగా"

అన్నాడు... దృష్టి స్టీరింగ్‌మీదే వుంచి. ముఖం చూడకుండానే భావాలు స్టడీ చేయగలడన్నమాట విశ్వనాథం.

"కాని యిప్పుడే చీకటిపడిపోయింది. యింట్లో అమ్మా ఆదుర్దా పడుతూ వుంటుంది" అన్నది ఆందోళితురాలై.

కారు నాలుగు మెలికలు తిరిగి వీటవాలుగా వున్న రోడ్డు చివరికంటా పాకి ఒక చిన్న డాబా ప్రహారీగోడ గేటు ముందు ఆగిపోయింది. చీకటి నిర్మానుష్యంగా వున్నది.

కారు శబ్దంవిని లోపలినుండి చౌకీదారు పరుగెత్తుకొచ్చి గేటు తీసాడు. యిల్లుకూడ నిర్మానుష్యంగా వుంది.

విశ్వనాథం సరాసరి గేటులోనుండి డాబా మెట్ల వరకూ పోనిచ్చి కారును ఒక మూలగా పార్క్ చేసాడు. దిగి వచ్చి డోర్ తెరుస్తూ..."దిగండి శాంతాదేవీ!" అన్నాడు.

శాంత కారుదిగి యివతలకు వచ్చింది.

చౌకీదారు గేటుదగ్గిరే వున్నాడు. శాంత గుండె వేగంగా కొట్టుకుంటోంది. విశ్వనాథం అక్కడికి ఎందుకు తీసుకు వచ్చాడో అర్థంకావడంలేదు ఆమెకు.

వరండాలోకి వెళ్ళి స్విచ్ ఆన్ చేసాడు. దీపాలు వెలిగాయ్.

చల్లటి గాలివీస్తోంది...డాబా ముందు తోటలో చెట్లు తలలూపుతున్నయ్...

చీకట్లో బంజారాహిల్స్‌మీద బంగళాలో దీపాలు కిందికి దిగివచ్చిన నక్షత్రాల్లా మెరిసిపోతున్నాయ్.

అనంతమైన తమస్సు...గాలిలో ఆధారం లేకుండా వేలాడ దీయబడినట్లు చిందర వందరగా విద్యుత్కాంతిపుజం.

భరించలేని నిస్తబ్దత...ఏదో వింతలోకంలోకి వచ్చి నట్లు అనిపించింది శాంతకు.

డాబా తలుపుతెరిచి స్విచ్ వేస్తూ "యిలారా శాంతా దేవీ!" అన్నాడు విశ్వనాథం.

ముందు గదిలో నాలుగు సోఫాలు; పెద్ద టేబిలూ, దానిచుట్టూ చిన్న కుర్చీలూ వున్నై...

గోడకు నాయకుల ఫోటోలు అమర్చ బడివున్నై...

శాంత లోపలికి అడుగుపెట్టింది. "నేనిక ఆగలేను... త్వరగా యింటికి వెళ్ళాలి..." అన్నది ఆదుర్దాగా.

ఆ మాట విననట్లే... "అలా కూర్చోండి: మీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడాలి" అన్నాడు తను ఒక సోఫాలో కూర్చుంటూ విశ్వనాథం.

భీతహారిణిలా విశ్వనాథాన్ని చూచింది శాంత. విశ్వ నాథం గొంతుకలో చిరుకంపనం, భీరుత్వం పసిగట్టగలిగింది శాంత. అందుకే శాంత జరుగబోయే పరిణామానికి భయ పడ్డది.

ఒక అర్థహీనమైన దృష్టి శాంతవైపు విసిరి; ప్యాంట్ జేబునుండి నోట్ల కట్టతీసి లేచినుంచిని శాంతను సమీపిస్తూ "యిదిగో తీసుకో" అని పెదిమలపై నవ్వు తెచ్చుకున్నాడు.

శాంత చేయిపట్టుకొని తనదగ్గరకు లాక్కొందామని ముందుకు వంగాడు విశ్వనాథం.

చేయి విదిలించి లేచి నిలబడుతూ... "క్షమించండి విశ్వనాథంగారూ... పొరపాటుపడ్డారు... మర్యాదగా తప్పుకోండి" అన్నది కంపితస్వరంతో.

విశ్వనాధం, దగ్గరకు వచ్చాడు... తనను రెండు చేతులతోనూ బంధించబోయే విశ్వనాధాన్ని విదిలించి వెను కకు తోసింది శాంత.

విశ్వనాధం వెనుకకు పడిపోయాడు టేబుల్‌పైకి...

టేబుల్ కొన తలకు కొట్టుకున్నది... తల దిమ్మె క్కింది, తేరుకుని లేచి "యింతేనా శాంతా... ఆలో చించుకో... మించిపోయిందేమీ లేదు" అన్నాడు.

"మీరనుకున్నంత నీచంగా లేను విశ్వనాధం గారూ... మర్యాద నిలబెట్టుకోలేకపోయారు... మీ డబ్బు మీదగ్గరే వుంచుకోండి... డబ్బు లేనంతమాత్రాన అంత నైచ్యానికి వొడిగడ్తామనుకోకండి. మీ మేలు మరువలేనిదే గాని, కారణం లేకుండా ఎందుకు మామీద మీకు ఎందుకు అంత జాలి కలిగిందో నాకు యీ రోజు అర్థమైంది. జాగ్ర త్తగా మసులుకోండి" అని విసురుగా బయటికి వచ్చేసింది.

"శాంతాదేవీ..." అని బిగ్గరగా అరిచాడు విశ్వ నాధం వెళ్ళిపోతున్న శాంత నుద్దేశించి. అప్పుడే ప్రహరీదాటి రోడ్డుకు చేరింది శాంత.

అటుగా వెళుతున్న టాక్సీ పిలిచి "సికింద్రాబాద్ స్టేషన్ పోనీ" అన్నది కూర్చుంటూ..

విశ్వనాధం అనుకున్నదంతా తలక్రిందులయిపోయింది.

సోఫాలో నెత్తికి తగిలిన బొప్పి సవరించుకుంటూ కూర్చుండి పోయాడతను.

♦ ♦ ♦

మరునాడు శాంత స్కూలుకు వెళ్ళలేదు.

టాక్సీలో కూర్చుని యింటికి చేరేవరకూ భయంతో వణికిపోతూనేవుంది. కళ్ళలో నీళ్ళు పొంగి వచ్చినై.

మరునాడు యింట్లో కూర్చున్నా, నిన్నటి స్మృతిలో తేలుకుట్టినట్లు బాధపడుతూనే వున్నది శాంత.

ప్రతిక్షణం విశ్వనాథం పాపిష్టి ముఖం, నోట్లకట్ట వికృత రూపంలో ఆమె కళ్ళముందు కనిపిస్తూనే వున్నై...

"స్త్రీ డబ్బుతో కొనే వస్తువన్నమాట నాలో ఏమి చూసి విశ్వనాథం అంత డబ్బు ఎరచూపాడు?" అని పదే పదే తర్కించు కొంటోంది శాంత.

ఈవిషయం ఎవరితో నోరువిప్పి చెప్పుకోగలుగుతుంది. అందుకని డైరీ తీసి రాయసాగింది. ఎవరికీ చెప్పలేని విషయం డైరీతో చెప్పుకుంటుందామె.

కాని డైరీ తీసి వ్రాయబోయే సమయానికి ఏదో అనిర్వాచనీయమైన బలహీనతకు లోబడ్డదామె! "ఈ అవమానకరమైన విషయంరాసి డైరీలోని స్వచ్ఛమైన కాగితాలను ఎందుకు కలుషితం చేయడం?" అనుకున్నది శాంత.

ఆ భావం రాగానే డైరీ ఒక మూల పడేసింది. కొంత సేపు స్తబ్దుగా ఎటో చూస్తూ కూర్చుండిపోయింది.

డైరీ పేజీలు చిందరవందరగా పడివున్నై... అందులో శాంత తన జీవితంలోని సుఖక్షణాలు, దుఃఖక్షణాలు రెండూ రాసింది. ఆమె డైరీని యింటర్‌లో చేరినప్పటినుండి రాస్తోంది.

ఎటో ఆలోచిస్తూ, తిరిగి కిందపడిన డైరీ తీసి పేజీలు తిరగవేసింది.

సెక్రటరీతో సినిమాహాలులో జరిగిన సంఘటనపై ఆమె దృష్టి నిలిచిపోయింది.

తను వుపాధ్యాయినిగా చేరినప్పటినుండీ యిలాంటి సంఘటనలు జరుగుతూనే వున్నై. స్త్రీని చూస్తే మగవాడికి ఎందు కింత అలుసో...

ఎంతోమంది స్త్రీలు, ఆఫీసుల్లో, అన్ని రంగాల్లో వుద్యోగం చేస్తున్నారు. చిన్న వుద్యోగస్తురాలి దగ్గరనుండి వున్నతోద్యోగస్తురాలి వరకు స్త్రీ అంటే పురుషుడు కాముక దృష్టి తప్ప మరో దృష్టితో చూడడు. స్త్రీ పురుషుడి ఆట వస్తువు. స్త్రీకి సమాజంలో రక్షణలేదు.

బడికి పోకుండా విచారంగా కూర్చున్న కూతుర్ని చూసి సరస్వతమ్మ.

"వొంట్లో బాగాలేదా తల్లీ...అలా వున్నావు" అన్నది.

జవాబు ఏమి చెప్పగలుగుతుంది. రాత్రి ఆ సంఘటన జరిగినప్పటినుండి, తల్లిదండ్రులకు ముఖం చూపించాలంటే బిడియాగా వుంది శాంతకు.

"ఏం లేదమ్మా...ఒంట్లో బాగానే వుంది" అన్నది శాంత క్లుప్తంగా...

సరస్వతమ్మ తర్వాత ఏమీఅడుగలేదు. కాని కూతురి ముఖంమీది విచార ఛాయలు చూచిన ఆమెకు ఒంట్లో బాగాలేదేమో అని అనుమాన పడ్డది.

యింతలో కాళిదాసు "అమ్మాయ్ శాంతా!" అని పిలిచాడు.

అంతకుముందు తన తల్లి తండ్రితో ఏదో మాట్లాడడం విన్నది శాంత. ఆ సంభాషణలో తన ప్రస్తావనకూడ వచ్చింది.

"విశ్వనాథంతో జరిగిన విషయం తెలియలేదుగదా" అని అనుమానపడ్డది శాంత.

శాంత వెళ్ళగానే "అలా కూర్చో తల్లీ" అన్నారు.

"ఏవి. ఆ ఫోటోలు అమ్మాయ్‌కి యివ్వు చూస్తుంది" అన్నాడు కాళిదాసు.

సరస్వతమ్మ ఒక కవరుతీసి శాంత చేతిలో పెట్టింది.

తాముకూడ చూద్దామని వుత్సాహంతో వస్తున్న దుర్గ, రఘులను వారించింది సరస్వతమ్మ "మీకెందుకు పోయి చదువుకోండి" అంటూ. విజయ చదువుకుంటున్నది.

"పులిపాకవారి సంబంధం జరిగితే బాగుండేదే" అన్నాడు కాళిదాసు భార్యతో.

"రాతలో వుండొద్దూ... సరేనన్నవాళ్ళే మాట తప్పిరి. ఏంచేస్తాం"

"ఆ ఫోటోలు చూడుతల్లీ... బెజవాడనుండి నా స్నేహితుడు పంపాడు" అన్నాడు కాళిదాసు. విషయం శాంతకు అర్థమైంది. అయిష్టంగా కవరు తండ్రి మంచం పట్టె మీద పెట్టింది. కవరు జారి క్రిందపడి, కవరులోనుండి ఒక ఫోటో జారి గచ్చుపై పడ్డది...

ఆ ఫోటోలో మనిషికి ముప్పై అయిదేళ్ళుంటయ్. కళ్ళు లోతుకుపోయి వున్నై. ధోవతి - చెప్పులు. లాల్చీ, యిదీ ఆకారం, ఫోటోలో నిలబడి వున్నాడు.

"సిగ్గుపడబోకు తల్లీ ... చూడు ఫరవాలేదు" అన్నాడు కాళిదాసు కూతురు సిగ్గుపడి కవరు పెట్టేసిందేమోనని అనుకుంటూ.

"ఆ పడిపోయిన ఫోటో చూడు. పెళ్ళాం పోయిందట... ఇద్దరు పసిపిల్లలుట. పెద్దపులివర్రులో యాభై యకరాల ఆస్తివుండట" అంటున్నాడు కాళిదాసు.

సరస్వతమ్మ కూతురి మొహంలోకి తదేకంగా చూస్తోంది.

శాంత క్షణంలో లోలోపలే ఆలోచించుకుని, దృఢ స్వరంతో "నేనిప్పుడప్పుడే వివాహం చేసుకోను నాన్నా" అన్నది.

కాళిదాసు, సరస్వతమ్మ వులిక్కిపడి కూతురివైపు చూచారు. కూతురు ఏమన్నదో వారిద్దరికీ సరిగ్గా బోధ పడలేదు.

"పెళ్ళి చేసుకోవూ... యింకెప్పుడు చేసుకుంటావుట" అన్నది సరస్వతమ్మ కూతురి ధోరణి నచ్చక.

"ఏమో చెప్పలేను. ప్రస్తుతం పెళ్ళిచేసుకోనని; నిశ్చయించుకున్నానమ్మా"

"యిహ అన్నీ నీ యిష్టమనేమిటీ... సంపాదిస్తున్నానని. అంతా నీదే పెత్తనమనుకోకు యింకా పెద్దవాళ్ళం బతికే వున్నాం" సరస్వతమ్మ కోపంపట్టలేక పోయింది.

యిన్నాళ్లూ కాళిదాసు చదువు మిషతో పెళ్ళివాయిదా వేస్తూ వచ్చాడు. భర్త ఒప్పుకున్న పెళ్లికి కూతురే అడ్డు పెడ్తున్నది. "పెళ్ళయితే పిచ్చికుదరదు. పిచ్చికుదిరితే పెళ్ళి కుదరదు" అనుకున్నది సరస్వతమ్మ.

కాళిదాసుకు తెలుసు యిలాటిసమయాన చివాట్లతో లొంగదీసే ప్రయత్నం చేయకూడదని.

సౌమ్యకంఠంతో "నీకు అనుభవంలేదుతల్లీ ... మేమేం జేసినా నీ మేలుకోసమే గదా ... చెప్పినట్లు చెయ్యి"అన్నాడు కాళిదాసు.

శాంత తలవంచుకున్నది ... "లేదు నాన్నా. నాపెళ్ళి విషయం మీరు బాధపడబోకండి ... యీ విషయంలో నన్ను బలవంతం చేయకండి. నేను అన్నీ ఆలోచించే చెబుతున్నాను." అన్నది దృఢచిత్తంతో.

సరస్వతమ్మ ఏవిషయంలో నయినా వూరుకుంటుంది గాని, కూతురిపెళ్ళి విషయంలో మాత్రం తను చెప్పినట్లు చేయమంటుంది. ఆమెకు ఓర్పు నశించిపోతోంది.

"నీమాట నీదేనన్నమాట ... ఏమిటీ నీవు ఆలోచించింది!" అన్నది సరస్వతమ్మ.

'కాసేపు నువ్వూరుకో''అన్నాడు కాళిదాసు భార్యకు కోపం ఎక్కువవుతోందని కనిపెట్టి.

"పోనీ నీవుద్దేశ్యమేమిటో చెప్పుతల్లీ!" అన్నాడు కాళిదాసు కూతురివైపు తిరిగి సానునయంగా.

శాంత తలవంచుకుని కూర్చుండి పోయింది జవాబు చెప్పకుండా.

"మేమిట్లా వాగడమేగాని; నువ్వు నోరెత్తి సరైన మాటమాట్లాడ వన్నమాట" అన్నది సరస్వతమ్మ.

శాంత తలఎత్తి చూచి "యింకా ఏమిచెప్పాలి. మీకేమో పరిస్థితి అర్థంచేసుకుందామని లేదు... నేను పెళ్ళిచేసుకుని నాదారిన నేనుపోతాను. నాన్న కాలూ చేయీ నయంగాలేదు. విజయ, రఘు, దుర్గలు చదువుకోవాలి. నాదారిన నేను పోతే యింతసంసారం ఎట్లా నడుపుతారు. యింకా నాపెళ్ళికి అప్పుచేయకుండా అసలు కుదరదు. అప్పుచేసి పెళ్ళిచేసుకునే కన్నా, అసలు చేసుకోకుండా వుండడమే నయం... నేను చెప్పిందీ ఆలోచించండి మీరు... నేను పెళ్ళిచేసుకోను" అన్నది నిశ్చలంగా.

కాళిదాసు వదనంలో గర్వభావం తొణికిసలాడింది కూతురి త్యాగబుద్ధికి, విజ్ఞతకు.

కాని ఆ భావం కొంతసేపేవున్నది ఆయన ముఖంలో. సాయంసమయాన ఆకాశం క్షణానికోరంగు మార్చుతున్నట్లు వెంటనే ఆయన ముఖంలో విచారపుసీడలు ఆవరించినై. "తన కాలూ చెయ్యీ బాగుంటే కూతురిపెళ్ళి లక్షణంగా జరిపేవాడిని గదా" అని అనుకుని నిట్టూర్చాడు భారంగా.

ఆ కాసేపట్లోనే తను ఎంతో వృద్ధుడైనట్లు, అశక్తుడయినట్లు, కాళ్ళూ చేతులు అన్నీ పడిపోయినట్లు బాధపడ్డాడు.

అంతటితో పెళ్ళివిషయం విరమించుకున్నది సరస్వతమ్మ...

♦ ♦ ♦ ♦

మర్నాడు శాంత స్కూలుకి కాస్త ఆలస్యంగా వెళ్ళింది, అసలు వెళ్ళాలని లేదు. యివాళ కూడ సెలవు పెడ్దామని అనుకుని బద్ధకంగా కూర్చుండిపోయింది. కాని ఎన్నాళ్ళని యింట్లో కూర్చోవడం. యింట్లో కూర్చున్నా ఏమీ తోచడంలేదు" అందుకని తాపీగా తయారై స్కూలు చేరింది శాంత.

ఒకరోజులోనే వాతావరణమంతా భిన్నంగా కనబడింది శాంతకు. కొన్ని నెలల తర్వాత వెళ్ళినట్లు అనుభూతి పొందింది.

టీచర్స్ రూంలోకూడ వాతావరణం స్తబ్ధుగావుంది. అనుమాయమ్మ లలితాంబలు కూడ యివాళ ఏమీ వదరడంలేదు. మేరీ ఆనందం ముఖం అత్యంత గంభీరంగా వుంది. హెడ్‌మిస్ట్రెస్ రూంలో ఆ స్కూలులోనే చదివే ఒక అమ్మాయి వున్నది. పక్కనే ఒక ముసలావిడ ఆమెముఖంలో నిరాశ, దుఃఖం, క్రోధం, తొంగిచూసలాడుతున్నయ్.

శాంతకు సందర్భం ఏమిటో అర్థంకాలేదు. హెడ్‌మిస్ట్రెస్ టేబుల్ ముందు సెక్రెటరీ రెడ్డికూడ కూర్చుని వున్నాడు.

సంగతేమిటో కనుక్కుందామని నిర్మలకోసంచూసింది శాంత.

నిర్మల అప్పుడే క్లాసుకి వెళ్ళిపోయింది... శాంత పుస్తకాలు అందుకుని, తన క్లాసులోకి వెళ్ళిపోయింది.

ఫస్ట్‌పీరియడ్ కాగానే శాంతకు దారిలో నిర్మల కలిసింది. కాని విశేషాలేవీ మాట్లాడలేదు... హడావుడిగా

వెళ్ళిపోయింది. కాని నిర్మల ముఖంలోని భావాలు శాంత వుత్సుకతను మరీ ఎక్కువ చేసింది.

మధ్యాహ్నం రీసెస్‌లో శాంతను ఒక పక్కకు పిలిచి "నీకు యీ సంగతి తెలిసిందా ?" అన్నది మెల్లిగా.

శాంత గుండె కొట్టుకొంటూన్నది వేగంగా...! నాకు ఏమీ తెలియదు అక్కా. ఏమయిందో చెప్పు.

నిర్మల ఎవరయినా చూస్తున్నారేమోనని యిటూ అటూ చూసి-

"నిన్న ఒక ఘోరం జరిగింది" అన్నది.

"ఏమిటో చెప్పు చంపక"

"రేవతి తెలుసుగా... ఫిఫ్త్‌ఫారం చదువుతున్నది... ఆపిల్లని నాశనం చేసారు..." అసహ్యం, క్రోధం మిళితమైన స్వరంతో అన్నది నిర్మల.

"ఎవరో తెలిసిందా ?"

"తెలియటానికేం తెలిసింది. కాని కప్పిపెడుతున్నారు."

"అంటే !"

"సెక్రెటరీ గడ్డేనని ఆ పిల్ల ఏడుస్తూ స్వయంగా చెప్పింది."

"ఆఁ... రెడ్డా..." నోరు తెరిచింది శాంత...

శాంతకు సినిమాహాల్లో అతని వెకిలి ప్రవర్తన గుర్తుకు వచ్చింది.

"మేరీ ఆనందానికి కూడా భాగం వున్నది యీ వ్యవహారంలో" రేవతిని మేరీ యింటికి రమ్మన్నది ఏదో పని

వున్నదని. రేవతి యిల్లు పికెట్‌లో వుంది. బీదవాళ్ళు... తండ్రిలేడు. ముసిలి తల్లి ఒక్కతే వున్నది... హెడ్‌మిస్ట్రెస్ రమ్మన్నది గదా అని యింటికి వెళ్ళి తల్లితో చెప్పి మేరీ యింటికి వచ్చింది. పాపం తల్లి గుడ్డలు కుట్టి కూతుర్ని చదివి స్తున్నదట..." అని ఎవరైనా చూస్తున్నారేమోనని ఆపింది నిర్మల.

శాంత శిలావతుగా వింటూ వుండిపోయింది.

"రేవతి హెడ్‌మిస్ట్రెస్ యింటికి వెళ్ళేటప్పటికి అక్కడ సెక్రటరీ వున్నాడట... తర్వాత జరగాల్సింది జరి గింది... ఆ అమ్మాయికి తండ్రి, అన్నలు వుంటే ఏంచేసే వారో..."

"హెడ్‌మిస్ట్రెస్‌కు ఏమొచ్చిందిట..."

"హెడ్‌మిస్ట్రెస్ యిలాంటివెన్నో చేసింది. దానికి నీతీ నిజాయితీ వుంటేగా... తనే స్వయంగా భాగోతం నడు పుతూ వుంటుంది సెక్రెటరీతో... పాపిష్టిది"

"పోలీసు రిపోర్టు యిప్పిస్తే సరిపోయేదిగా" శాంత వుత్తేజితురాలై అన్నది.

"భయపడేది ఏముంది... రెడ్డిగాడేనని తెలుస్తూనే వుండ"

తను అన్న మాటలు తనకే నిస్సారంగా తోచినై... రెండు రోజుల క్రితం విశ్వనాథం చేసిన రభసకు తనుకూడ పోలీసురిపోర్టు యివ్వవచ్చు. మరి తను ఎందుకు భీరువులా వూరుకున్నది...

అందరకీ తెలిసిపోతుందనే భయంతో తగినంత రుజువు; సాక్ష్యం లేక. తను చెప్తే లోకం ఎంత నమ్ముతుందో, రేవతి చెప్పినా అంతే నమ్ముతుంది. ఒకవేళ రేవతి పోలీసురిపోర్టు యిచ్చినా, రెడ్డి డబ్బు ఎరచూపి కేసును "హూష్ కాకి" చేస్తాడు. యీ పిల్ల నలుగురిదృష్టిలోకి రావడం తప్ప ఒరిగే దేమీ వుండదు. అనిర్మలకూడ అదే భావము వెళ్ళబుచ్చింది.

మరి ఏం జరుగుతుంది యిప్పుడు? అన్నది శాంత ఓడిపోయిన దానిలా.

"ఆ ముసలావిడ న్యాయం చెప్పమని వచ్చింది... ఒకటే ఏడుపు... ఏమవుతుంది. ఏమీగాదు"

"మన టీచర్లంతా ప్రెసిడెంట్ దగ్గరకు పోయి, అంతా చెప్పి రిపోర్టు యిప్పిస్తే"

"మళ్ళీ మొదటికి వస్తావేమే పిచ్చి... యీ కాలంలో డబ్బువున్నవాడిదే ప్రపంచం. చివరికి న్యాయం వాడిదే నంటారు. రేవతిని, ముసలమ్మను రెడ్డి తన కారులో వాళ్ళ యింటికి గామోసు పంపేశాడు. ముసలావిడకు నోట్లకట్టలు పడేసి నోరు మూసినట్లున్నారు. రేవతిచేత ఏదో కాగితం రాయించుకున్నార్ట. ప్యూను తలుపు సందులోనుండి చూచాట్ట. చెప్పాడు. రచ్చకెక్కితే... ఆ పిల్ల భవిష్యత్తు— పెళ్ళి పెటాకులు— ఏంగాను" అన్నది నిర్మల.

శాంత దిగాలు పడిపోయింది.

"తప్పు ఎవరిదైనా... శిక్ష స్త్రీకే. శాంతా దీనికి

విరుగుడు జరిగేదాకా స్త్రీ అధో పాతాళంలోనే పడి వుంటుంది" అన్నది నిర్మల విచారంగా.



బడి వదలి పెట్టారు. పిల్లలంతా బిలబిలా వెళ్ళి పోయారు.

ఫ్యాను క్లాసు తలుపులు మూసివేస్తున్నాడు ఒక్కొ టొక్కటీ.

టీచర్లందరూ అలిసిపోయి వుసూరుమంటూ యింటి దోవ పట్టారు. కొందరు ట్యూషన్స్ టైమయిందని త్వర పడుతూ వెల్తున్నారు.

శాంత ఆఫీసు వరాండాలో నిర్మలకోసం చూస్తూ నిలబడ్డది. రెండురోజుల క్రితం విశ్వనాథం నేర్పిన గుణపాఠం గురించి నిర్మలతో చెప్పాలని అనుకుంటున్నది శాంత. విశ్వ నాథం పిల్లల ట్యూషన్ మానినప్పటినుండి జీతం చాలడంలేదు తండ్రికి చెయ్యి పూర్తిగా నయమైపోయింది. కాలు యిప్పు డిప్పుడే కదపగలుగుతున్నారు. యిప్పుడు గనుక అశ్రద్ధచేస్తే యింతవరకు చేసినదంతా నిష్ఫలమైపోతుంది ... నిర్మల ద్వారా రెండు మూడు ట్యూషన్‌లు సంపాదిద్దామని కూడ శాంత వుద్దేశ్యం. ఆ విషయంకూడ నిర్మలను అడుగు దామను కొన్నది.

యింతలో ఫ్యాన్ వచ్చి ఒక కాగితం యిచ్చాడు.

శాంత యిది ఏమిటా అని భయపడ్డది. మడతవిప్పి చూచింది. హెడ్ మిస్ట్రెస్ రాసింది అది.

"సెక్రెటరీగారు మీతో ముఖ్య విషయం మాట్లాడ దలుచుకున్నారు. ఒకసారి వచ్చి పోవాల్సింది" కింప మేరీ ఆనందం సంతకం చేసింది.

క్షణకాలం శిలావతుగా వున్నచోటే నిలబడిపోయింది. ఏమిచేయడానికి పాలుబోలేదు.

తర్వాత ధైర్యం తెచ్చుకుని మెల్లిగా ఆఫీసు రూంలోకి వెళ్ళింది. సెక్రెటరి రెడ్డి ముఖం గంభీరంగా వుంది. ప్రెసి డెంట్ కూడ పక్కనే వున్నాడు.

విషయమేమిటా అనే ఆలోచనలో, తత్తరపాటులో ఆమె వారికి అభివందనం చేయడం కూడ మరచిపోయింది.

ప్రెసిడెంట్ కోపంగా వున్నట్లు కనిపించాడు.

శాంతను ఎదురుగా ఒక ఖాళీ కుర్చీవుంటే, కూర్చో మని నొసటితో సంజ్ఞ చేసాడు.

తనను పిలవనంపడంలోని అంతరార్థ మేమిటో అర్థం కాలేదు శాంతకి. బంజారాహిల్స్‌లోని సంఘటన జ్ఞప్తికి వచ్చింది.

ఈ విషయం ప్రెసిడెంట్‌కు తెలిసిందేమో, కారులో వెల్తుంటే చూసారేమో ఎవరైనా!

నేరస్తురాలిలా తలవంచుకుని కూర్చుంది శాంత.

"యీావిడమీద యిది మొదటిసారి కాదండీ రిపోర్టు రావడం ... యిదివరలో చాలసార్లు వచ్చినయ్యండి" అన్నాడు రెడ్డి ఆయనతో.

శాంత నిర్విణ్ణురాలయింది.

"ఏవమ్మా... యిది బడి అనుకున్నావా సానికొంపను కొన్నావా... రేవతిని నీతో నిన్న ఎందుకు తీసికెళ్లాల్సొచ్చింది!" అన్నాడు కోపంతో ఆయన.

శాంత స్థాణువులా చూస్తూ వుండిపోయింది. సెక్రెటరీ రెడ్డి ఏదో షడ్యంత్రం పన్నాడు... మెదలకుండా వూరుకో గూడదు.

"మీరనేదేమిటో నాకర్థంగావడంలేదు నేనెవరినీ ఎక్కడికీ తీసుకుపోలేదు" అన్నది శాంత విషణ్ణ వదనంతో.

సెక్రెటరీ రెడ్డి ఒక విషపునవ్వు విసిరాడు.

"అయితే నేనే అబద్ధం చెబుతున్నానన్నమాట... అబద్ధమాడాల్సిన ఖర్మ మాకేంబట్టిందీ" అంటూ ఒక కాగితాన్ని ఆమె చేతికిచ్చాడు.

"దీనికి సంజాయిషీ చెప్పవమ్మా... అన్నాడు విసురుగా. ముసలివాడేమో, మరీ వుద్రేకంతో వణికిపోతున్నాడు.

శాంత తల తిరిగిపోతోంది కాగితంలో వున్నది చదివి "ఎవరో కావాలని పన్నిన పన్నాగం యిది... నాకేమీ తెలియదు" అన్నది.

ప్రెసిడెంట్ కోపంతో కంపించిపోయాడు.

"అబద్ధమాడితే ప్రయోజనంకన్న నష్టమే ఎక్కువ కలుగుతుంది. ఆ అమ్మాయే స్వయంగా నీవు తీసికెళ్ళావని రాసిస్తే నమ్మమంటావా వద్దా. ఆ అమ్మాయికి ఏదో ట్యూషన్లు యిప్పిస్తానని చెప్పి తీసికెళ్ళావట... తర్వాత..."

కోపంలో యిక మాట్లాడలేకపోయారు... కొంతసేపు ఆగాక, తమాయించుకుని "ఆ అమ్మాయి స్వహస్తాలతో

రాసిన కాగితం చూస్తివి... అందరూ నీవే ఆపని చేసినదని అంటున్నారు. సెక్రటరీగారు పోలీసు రిపోర్టు యిస్తానని బయలుదేరితే నేనే ఆపాను. ఏదో బుద్ధిమంతురాలివి అనుకున్నాను. నా కూతురుగా భావించి వెంటనే వుద్యోగమిచ్చాను. చివరికి యిదా నువ్వు చేసేది" అన్నాడు.

తన స్వంత కూతురు కళంకం తెచ్చుకున్నట్లు బాధ పడుతున్నాడు ఆయన.

"మీకు నాపై నమ్మకంవుంటే నమ్మండి. యదార్థంగా నేనీవిషయం ఎరుగనే ఎరుగను. సెక్రటరీగారు పగ దీర్చుకున్నారు. అంతే" అన్నది శాంత.

ఆ రోజు సినిమాహాలులో సెక్రటరీ ప్రవర్తన ఏకరువు పెడ్దామనుకున్నది కాని ఆమె గొంతు పెగలలేదు.

ప్రెసిడెంట్ శాంత మొహం పరిశీలనగా చూసాడు. ఆమె నిర్దోషేనేమో అని అనుమానం కూడ కలిగింది ఆయనకు - అందుకని సందేహాస్పదంగా సెక్రెటరీ ముఖంలోకి చూచాడు.

"నీవు బాధ్యురాలివి కాదనిన దానికి నిదర్శన మేమీ లేదు. ఆ అమ్మాయే స్వయంగా రాసిన కాగితం. దీనికంతటికీ నీవే కారకురాలివని చెపుతున్నది" అన్నాడాయన.

"ఇది నాకు విరుద్ధంగా కావాలని చేసినది. అంతకన్న ఎక్కువ నేనేం చెప్పను!" అన్నది శాంత.

"బడికి చెడ్డపేరు నిముషంలో వస్తుంది. మంచి పేరు సంపాదించడం కష్టం... మీరు యీ స్కూలులో పనిచేయనక్కర్లేదు. యిది నా తండ్రి స్మృతి చిహ్నంగా కట్టినబడి.

ఎలాంటి అపకీర్తివచ్చినా నేను సహించలేను" అన్నాడు ఆయన.



శాంత యివతలకు వచ్చిచూస్తే నిర్మల కనబడలేదు. శాంత వెళ్ళిపోయిందేమోనని ఆమెకూడ వెళ్ళింది. శాంత యింటికి ఎలా చేరిందో ఆమెకే తెలియదు.

భవిష్యత్తు మహారాక్షసిలా ఆమె కళ్ళముందు కరాళ నృత్యం చేస్తున్నది.

యిటు తండ్రికి ఒకటి రెండు నెలల్లో పూర్తిగా తగ్గిపోయే సూచనలు కనిపిస్తున్నాయి. మధ్యాంతరంగా యిదొకటి వచ్చిపడ్డది.

ఉద్యోగం పోయినట్లే లెక్క...వుద్యోగం పోవడమే గాక, ఒక కళంకం తనకు అంటగట్టారు...నేను అసలు ఎరుగని దానికి శిక్ష అనుభవించాల్సి వస్తోంది. డబ్బుగలవాళ్ళు చేసే పనులివి.

హనుమాయమ్మ లలితాంబ యీ అపవాదు నాన్నకు ఎలాగో అలా తెలిసేలా చేస్తారు...నాన్నకూడ నన్ను అనుమానిస్తే...

ఏమో!!...నాన్న అనుమానించరు...నా సంగతి ఆయనకు బాగా తెలుసు.

కాని ఆయనకు మంకులు ఎలా!...

సెక్రెటరీతో సఖ్యతగా వున్నట్లయితే యింత జరుగక పోను...

ఆయనను మంచి చేసుకోడం అంటే మాన మర్యాదలు వదులుకోడమే... యింటి పరిస్థితులు చక్కబడేటంత వరకు తెలివిగా మసులుకోవాల్సింది.

తన ఆలోచనలకు తనే అసహ్యించుకుంది శాంత. తన సంసార పరిస్థితి ఎంత హీనాతి హీనంగా వున్నా తను అలాంటి పని ఎన్నడూ చెయ్యదు.

హనుమాయమ్మ, లలితాంబ డబ్బుకోసం మాన మర్యాదలు పోగొట్టుకున్నవాళ్ళు ... సెక్రెటరీ దృష్టిలో వేశ్యలకన్న హీనం వాళ్ళు. ఒకప్పుడు వాకిని తన లాగే లోబరచుకొని వుండవచ్చు.

తను తృణీకరించింది. వాళ్ళు బోనులో చిక్కుకున్నారు... అంతే తేడా.

హనుమాయమ్మ, లలితాంబ గుర్తుకురాగానే ఆమె మనస్సు వారియడల ద్వేషంతో నిండిపోయింది.

ఎన్ని కష్టాలు వచ్చినా తను మార్గంతప్పదు...

ఆమె కళ్ళలో నీరు వుబికివచ్చింది.

స్త్రీ వివశత నాధారం చేసుకుని లోకం ఎందుకు ఆమెతో చెలగాటమాడుతుంది! సామాజిక వ్యవస్థలో సర్వ శక్తులూ పురుషుడి చేతిలోనే కేంద్రీకృతమై వున్నై. స్త్రీని సరీగా జీవించనియ్యదు యీ సమాజం... తను చెప్పినట్లు కీలుబొమ్మలా ఆటలాడే ఆడదంటేనే పురుషుడికి యిష్టం.

యింట్లో తండ్రితో ఆ విషయం ఎలా చెప్పాలో అర్ధంకాలేదు శాంతకు.

గుమ్మంలో అడుగుపెడుతున్న శాంతకు చెల్లెలు దుర్గ

సంతోషంతో ఎదురొవచ్చి కావిలించుకుంది.

"ఏమిటీ అల్లరి... వెళ్ళి చదువుకో పో" అన్నది విదిలిస్తూ శాంత.

దుర్గ నీరుకారిపోయింది. ఎన్నడూ అక్కయ్య తనను కోపగించుకోలేదు... అక్కయ్య నిష్కారణమైన కోపానికి ఆశ్చర్యపడ్డది దుర్గ... మొహం యింతచేసుకుని చదువుకో డానికి వెళ్ళిపోయింది.

అంతా అయిన తర్వాత శాంత తన నిష్కారణమైన కోపానికి చింతించింది.

అనవసరంగా ఎందుకు కేకవేసానా అని బాధపడ్డది.

బిక్కు బిక్కుమంటూ నిలబడ్డ చెల్లెలిదగ్గరకువెళ్ళి తల మీద చెయివేసి "కోపమొచ్చిందా..." అన్నది.

దుర్గ కళ్ళల్లో నీరు పైకి పొంగివచ్చింది... అక్క మాటాడించగానే, వచ్చి నవ్వుతూ కావిలించుకున్నది.



ఉద్యోగానికి వుద్వాసన జరిగినప్పటినుండి శాంత ఎక్కడికీ వెళ్ళకుండా యింట్లోనే వుంటున్నది.

శాంత తండ్రికి గాని, తల్లికిగాని ఉద్యోగం వదలిపెట్ట డానికి కారణం చెప్పలేదు.

"ఉన్నట్టుండి ఎందుకు తీసేసారే ఉద్యోగంలో నుండి..." అన్నది సరస్వతమ్మ.

"ట్రెయిన్డ్ టీచర్లు ఎవరో వచ్చారట. నేను ట్రైన్డ్ కాదుగా" అన్నది శాంత...

"పోనీలే అమ్మా... యింటిపట్టున వుండు... నాన్నకు తగ్గుతోంది... అంతవరకూ ఏదో ఒకటి చూద్దాం" అన్నది తల్లి...

యింట్లో సానుభూతి వాక్యాలు. శాంత ఉదాసీనతను మరీ ఎక్కువచేస్తున్నై...

ఒకవైపు అపవాదు వచ్చిందనే దిగులు...

మరోవైపు కుటుంబ పరిస్థితి ఎలా చక్కబడుతుందా అనే విచారం—

నిర్మల అప్పుడప్పుడూ వచ్చి బాధపడవద్దని; ఎక్కడో ఒకటి చూద్దామని, ఎన్నోవిధాల సానుభూతి చూపి, ధైర్యం చెప్పేది...

శాంత తల్లిదగ్గరగాని, తండ్రి దగ్గరగాని హృదయం విప్పి మాట్లాడలేకపోయేది. నిర్మలనుండు అన్నీ విడమరచి చెప్పి సలహాలడగడానికి సంకోచించదు. వారిద్దరి స్నేహం అలాంటిది.

"మళ్ళీ కొత్త ప్రయత్నమే గదక్కా. యింత త్వరగా ఉద్యోగం ఎలాదొరుకుతుంది?" అన్నది శాంత నిరాశగా.

శాంత కంఠంలో నిర్వేదం. నిరాశ గ్రహించిన నిర్మల "యివాళ గాకపోతే రేపు దొరుకుతుంది. నీకెందుకు. నేనెక్కడైనా ట్యూషన్లు యిప్పిస్తాలే" అన్నది ధైర్యం చెబుతూ నిర్మల.

"నాన్న ఆరోగ్యమే నాకు బెంగగావుంది పూర్తిగా తగ్గిపోవచ్చింది. సమయానికి యిదొకటి... ఆయనవైద్యం మళ్ళా మూలబడింది... ఎలాగో అర్థంగావడంలేదు."

నిర్మల ఆలోచనలో పడిపోతుంది. ఒకరోజున శాంత దగ్గరకువచ్చి నిర్మల అనునయ స్వరంతో "నేనొకటి చెప్తా. వింటావా?" అన్నది.

జవాబు ఏమీ యివ్వకుండా నిర్మలవైపు ప్రశ్నార్థకంగా చూస్తూ వుండిపోయింది శాంత.

"రెండు ట్యూషన్లు కుదిర్చాను. నలభై యిస్తామన్నారు. చెప్తావా... నాన్న మందులకైనా వస్తుంది" అని అన్నది నిర్మల.

శాంతకు కాస్త ఆశారేఖ వుదయించింది...

"యిదిగో యీ వందవుంచు... యివాళ ఆయనకు తెలిసి కోప్పడ్డారు... యిబ్బంది పడతారేమో... యివ్వమన్నారు... తర్వాత చూచుకోవచ్చు" అని వందరూపాయల నోటు యిచ్చింది నిర్మల శాంతకు.

డబ్బు పుచ్చుకుంటున్న శాంత చేతులు వణికినై. కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగినై.

"నిన్ను కూడ యిబ్బంది పెడ్తున్నాను"

"బాబాయికి మందు యిప్పించు తగ్గిపోవచ్చింది గదా. అంతా చక్కబడిపోతుంది. బాబాయికోసం నేను యిస్తున్నాననుకో... తీసుకోపోతే... దెబ్బలు తింటావు నా చేతిలో యివాళ..." అన్నది చిలిపిగా.

శాంత పరిస్థితి గ్రహించిన నిర్మల అంతా చక్కబడే వరకూ తను కాస్తయినా సహాయం చెయ్యాలని నిశ్చయించుకున్నది... కళిదాసు ఆరోగ్యం బాగుపడితే ఎక్కడో

అక్కడ వుద్యోగం కుదురుతుంది... వదలిపెట్టిన కంపెనీ లోనే మళ్ళీ నౌకరీ యివ్వవచ్చు... అనుకున్నది నిర్మల.

"ఎక్కడ తెచ్చావో యీ డబ్బు చెప్పు" అన్నది శాంత.

"రాత్రి కన్నం వేసా పక్క యింట్లో" అన్నది నవ్వుతూ నిర్మల.

"ఎక్కడైనా అప్పు తెచ్చావా?... చెప్పాలి... కూడ రదు" అన్నది శాంత.

"ఆయన ఎక్కడో తెచ్చియిచ్చారు... నాకు తెలి యదు. ఆఫీసులో ఎడ్వాన్స తీసుకున్నారు కామోసు" అన్నది నిర్మల.

"వద్దు అక్కా... తీసికెళ్ళి యిచ్చివేయమను... మీకు యిబ్బంది అవుతుంది."

"నేను నీకు యివ్వడంలేదు. నీకు యిచ్చినప్పుడు అలాగే తిప్పికొడ్దువుగాని... మా బాబాయికి యిస్తున్నా ననుకో... మాట్లాడకుండా తీసుకో... అంతే" అన్నది నిర్మల.

నిర్మలకు కోపం వస్తున్నదని గ్రహించి అంతటితో ఆసంగతి విరమించింది.



వారంరోజుల్లో మరి రెండు ట్యూషన్లు యిప్పించింది నిర్మల.

నాలుగు ట్యూషన్లుచెబుతే డెభై రూపాయలు వచ్చేవి.

సరస్వతమ్మ మళ్లీ అన్నగారికి డబ్బుకోసం రాయక తప్పలేదు.

శాంత ఎన్నోచోట్ల ఉద్యోగప్రయత్నం చేసింది.

ఒక్క ప్రయత్నమూ సఫలం కాలేదు. ఎన్నియిబ్బందులు పడుతున్నా తండ్రివైద్యం మానలేదు... ఎలాగో అవస్థపడుతూనే వైద్యం యిప్పిస్తూనే వుంది.

మరో సంవత్సరం అలాగె గడిచింది...

యీ సంవత్సరమంతా సమాజపోకడ పరిశీలిస్తూనే వుంది శాంత.

ఆమె పరిశీలనకు సారాంశం... ఆమె ప్రశ్నకు జవాబు—

"స్త్రీకి సమాజంలో రక్షణలేదు.... స్త్రీ యెడల పురుషుడి వైఖరి మారాలి" అని...

కాళిదాసు కాలూ, చెయ్యీ రెండూ తగ్గినై... మామూలుగా నడవగలుగుతున్నాడు... కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకోనడం మంచిదని డాక్టరు చెప్పాడు.

తన ఆరోగ్యం బాగుపడిందని, తిరిగి నౌకరీలో జేరుతానని కబురుపెట్టాడు కాళిదాసు.

అయ్యరు అల్లుడు ఏమీ గొడవ పెట్టకుండానే అందుకు సమ్మతించాడు.

మరో ఆరునెలలు గడిచిపోయినై. కాళిదాసుకు పూర్తిగా స్వస్తత చిక్కింది. తిరిగి నౌకరీలో ప్రవేశించాడు.

♦ ♦ ♦ ♦

కాళిదాసు నౌకరీలో ప్రవేశించిన కొన్ని నెలలకు ఒక రోజున శాంత యింట్లో వుండగానే... సరస్వతమ్మ... "అమ్మాయికి యికనన్నా సంబంధాలు చూడండి... భగ

వంతుడి దయవల్ల మీకు నయమయింది యింకా ఆలస్యం ఎందుకూ !" అని...

శాంతవైపు చూచాడు కాళిదాసు.

"నాకు పెళ్ళి వద్దమ్మా..." నన్ను యిలా మీతోనే వుండనివ్వండి అన్నది శాంత.

కాళిదాసు కళ్ళు అశ్రుపూరితాలయినై ... సరస్వ తమ్మ స్థాణువులా కూతుర్ని చూస్తూ నిలబడిపోయింది.

యిప్పుడు శాంతకు జీవితమంటేనే విరక్తి.

ఉద్యోగం చేసి స్త్రీకి సంఘంలో గల విలువవేమిటో తెలుసుకోగలిగింది.

ఎన్నో సంసారాలు చూసి భార్యాభర్తలమధ్య జరిగే నిత్య సంఘర్షణ, ఒకరిపై మరొకరి అధికారం, ఈర్ష్యా, ఒకరి శీలంపై మరొకరికి అనుమానం, వ్యక్తిత్వం, విలువలకై పోట్లాట, కక్షలు, కార్పణ్యాలు... అసహ్యించుకున్నది.

శాంత తను వివాహం చేసుకోననీ... చెల్లెలికి చేయ మని చెప్పింది.

సరస్వతమ్మ ఆలోచించుకుని పెద్దకూతురు పెళ్ళి లాగానే ఆలస్యంచేస్తే చిన్నకూతురు జీవితమూ అలాగే మోడుబారిపోతుందని భయపడి భర్తతో పోరి సంబంధం కుదిర్చింది.

♦ ♦ ♦

విజయ పెళ్ళి అయి అత్తవారింటికి వెళ్ళిపోయింది.

రఘు, దుర్గ చదువుకుంటున్నారు...రఘు స్కూలు ఫైనలు...దుర్గ దర్జీపారం చదువు తున్నారు...

యిప్పటికీ సరస్వతమ్మకు శాంతనుచూస్తే గుండె తరుక్కుపోతూ వుంటుంది.

సాయంత్రం ఆఫీసునుండి యింటికి వచ్చిన కాళిదాసుకు మూర్తీభవించిన దైన్యంలా, దేవతామూర్తిలా... యిలవేల్పులా శాంత ఎదురుగా కనబడుతుంది.

శాంత మొహంలోకి క్షణకాలం చూసి; బాధగా తలవంచుకుని లోనికి వెళ్ళిపోతాడు...

విజయపెళ్ళి తర్వాతకూడ చాల తడవలు శాంతను పెళ్ళి విషయం అడిగింది సరస్వతమ్మ...

"దుర్గను, రఘును బాగా చదివించండి...దుర్గపెళ్ళికి డబ్బు నిలువచేయండి...యింకా నాకు పెళ్లేమిటి" అంటుంది శాంత.

కాళిదాసు అశ్రునేత్రాలతో కూతుర్ని చూస్తూ వుండిపోతాడు.

"నేను మీకు భారమైపోయానా నాన్నా...మీ అమ్మాయిని పోషించలేరా..." అంటుంది శాంత.

కాళిదాసు నిరుత్తరుడౌతాడు.

తెల్లవారు ఝామున నాలుగింటికి పడమటింట్లో శాంత పూజా మంటపంముందు నిలబడి శ్రీవెంకటేశ్వరునికి మేలుకొలుపు పాడుతుంది...

"కౌసల్యా సుప్రజారామ పూర్వా
సంధ్యా ప్రవర్తతే"

ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ
మాహ్నికమ్॥
శ్రీమన్నభీష్ట వదరాఖిలలోక బంధో
శ్రీ శ్రీనివాస జగదేకదయైక సింధో
శ్రీ దేవతా గృహ భుజాంతర దివ్యమూర్తే
శ్రీ వేంకటాచలపతే తవ సుప్రభాతమ్॥

శాంత సుప్రభాతం విని మంచంలో ముసుగుపెట్టి పడుకున్న కాళిదాసుకు మెలకువవచ్చి ముసుగులోనే "దేవత నాతల్లి" అని మెల్లగా గొణుక్కుంటాడు.

పలుచబడే చీకట్లలో విషాదంపలికే ఆమె గొంతుక కాళిదాసు గుండెల్లో బాకులు దింపుతూ వుంటుంది.

యిప్పుడూ ఆశతో శాంతను పెళ్ళికి ఒప్పిద్దామని ప్రయత్నిస్తాడు కాళిదాసు.

శాంత జవాబు మామూలే... కాళిదాసు భంగపడడమూ మామూలే.

అలా భంగపడినప్పుడల్లా ఆయన హృదయం మూగ కన్నీరు కారుస్తుంది.





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B165 |
| పుస్తకం పేరు | శాంత పెళ్లి |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 145 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ashwini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |